పుస్తకాలవిషయమై సలహాయిస్తాడు. ఏవిషయం మీాదైనా ఎవరితోనైనా సరికొత్తపద్ధతిలో చర్చిస్తాడు. అన్నిటికన్నా ముఖ్యంగా ప్రతి వ్యక్తినీ ఆకర్షించగలశక్తి ఏదో అతనిలో వున్నది. ఈ సుగుణాలే రాజారావుకు జగన్నాధంమీాద ప్రత్యేకమైన అభిమానం కలిగించాయి.

ఇంటరుప్యాసైనా నెలకు నల్భైరూపాయలువచ్చే వుద్యోగానైనా సంపాదించుకోలేని రాజారావుకు ఆలైబ్రరీ మంచి స్థావరంగానూ, జగన్నాధం మంచి నేస్తంగానూ దొరికారు. రోజూ ఐదో, ఆరో పుస్తకాలు చదివి లైబ్రరీ మూాసిందాకా జగన్నాధానికి కబుర్లు చెబుతూ కూర్చుని అతను అంతా సర్దుకుని లైబ్రరీ మూాశాక జగన్నాధంతోనే కలిసివెళ్ళి అగ్రిహారం సందుదగ్గర యిద్దరూ విడిపోవటం రాజారావుకు అలవాటు. రాజారావు ఆలోచనలనుంచి తేరు కుని చూాసేటప్పటికి యిల్లుదాటి ముందుకు వచ్చేశాడు. చీకటి, వెలుగుల్లో షికారుచేస్తున్నట్లుగా కొంచెందూరంలో నల్లచెరువుకట్ట కనిపించింది. రాజారావుకు అంతత్వరగా యింటికి వెళ్ళబుద్ధిపుట్టలేదు. నేరుగా వెళ్ళి చెరువుకట్టమీాద గానుగచెట్టుకింద కూర్చుని మళ్ళీ ఆలోచనలోపడ్డాడు

జీవితంచేసే సవాలును ఎదుర్కోవడంలోనే మానవుడి ఓర్పూ, నేర్పూ వున్నాయన్న నగ్నసత్యాన్ని రాజారావు చిన్న వయసులోనే తెలుసుకునే అవసరం, అవకాశం కలి గాయి. బాగా కలిమి కలిగిన సంసారంలో పుట్టిన ఈ రాజా రావుతండ్రి అన్నదమ్ములతో భాగాలుపడి, అర్ధలక్ష ఆస్తితో పల్లెటూరువదిలి గుంటూరు చేరుకున్నా, చేసిన

ప్రతి వ్యాపారంలోను నష్టపడి, నమ్మిన ప్రతివానివల్ల మోస గింపబడి, తనకు మూడో సంతానం పద్మ కలిగేటప్పటికి, భార్యకూడా పోయి, రెక్కాడితేకాని డొక్కాడని స్థితికి దిగ జారాడు. కాని యీ మార్పును, రాజారావు తండ్రిని బాగా అర్థంచేసుకున్న వాళ్ళెవరూ అతనికి తెలివితక్కువనుగాని, అసమర్థతనుగానీ ఆపాదించరు; సక్రమమైన మానవుడి జీవి తంలోకూడా విధి తేగల మార్పుకు ఒక తార్కాణంగా మాత్రమే చెబుతారు. ఆర్థికంగా, మానసికంగా బతికిపోయిన రాజారావుతండ్రికి బ్రతుకు వెగటుగా తోచింది తన కడు పున పుట్టిన పిల్లలను పోషించగలశక్తి తనకు లేకపోయింది; తన బంధువులనుగాని, స్నేహితులనుగాని చెయిచాచి యాచించగల గతికి అంతరాత్మ అంగీకరించలేకపోయింది. ఈ పరిస్థితుల్లో - కరువులో అధికమాసం వచ్చినట్లు-పద్మను చిన్నతనంలోనే పెళ్ళిచేసుకున్న మేనల్లుడు టైఫాయిడ్ వచ్చి కళ్ళుమూశాడు. దీంతో ఆయన మనస్సు చితికి పోయింది. పుట్టించినవాడు పెట్టకపోతాడా అన్న మొండి మనసుతోనే తన పిల్లలను వదిలి, రాజారావుతండ్రి ఎవరికీ తెలియకుండా ఎక్కడికో వెళ్ళిపోయాడు.

రాజారావుకి ఇంటర్ పరీక్షలు ఐపోయిన పన్నెండవ రోజున తండ్రి యిల్లువదిలి వెళ్ళిపోయాడు. వున్నట్లుగావుండి తండ్రి కనిపించకపోయేప్పటికి, పదిహేనేళ్ళతమ్ముడు రమణ, వాడితరువాత పిల్ల పద్మ బావురుమన్నారు. కాని, రాజా రావుమటుకు ధైర్యంతో, ఓర్పుతో కొన్నాళ్ళు ఎదురుచూసి చేయవలసిన ప్రయత్నాలుచేసి చివరకు ఆశవదులుకున్నాడు.

తండ్రి వెళ్ళిపోయినతర్వాత రాజారావుకు కలిగిన తొలిఅనుభవం తెమ బంధువుల్లో ఒక్కరుకూడ తమయింటివంకతొంగి చూడకపోవడం. తన కొక వుద్యోగందొరికితే ఎలాగైనా తమ్ముణ్ణి చదివించుకుంటూ చెల్లెలి బాగోగులు చూసుకోవచ్చుననుకున్నాడు. పట్టుదలతో ప్రారంభించి, స్వయంగానూ తెలిసినవాళ్ళద్వారా, స్నేహితులద్వారా, వుద్యోగంకోసం ఎన్నో ప్రయత్నాలుచేశాడు. కాని ఒక్కటీ ఫలించలేదు. కాలంగడిచినకొద్దీ బ్రతుకు భారంగా, దుర్ఘటంగా మారడం తప్ప మరో ప్రయోజనం కనుపించలేదు. అన్నబాధలను అర్థంచేసుకున్న రమణ ఏమి ఆలోచించాడో, ఎలా చేశాడో కాని, ఒక చిల్లరిఅంగడిలో సరుకులు అందించేపనికి నెలకు పన్నెండురూపాయలు వచ్చే వుద్యోగం కుదుర్చుకొని వచ్చి అన్నకు చెప్పాడు చిరునవ్వుతో. ఈ విషయం విన్నాక, రాజారావుగుండెలు పగిలిపోయాయి. ఆడుతూ పాడుతూ చదువుకోవాల్సిన యీవయసులో తనతమ్ముడు వుదయంనుంచి రాత్రి వరకు పన్నెండురూపాయలకోసం వెట్టిచాకిరి చేయడమా? పెరిగి పెద్దవాడై అసమర్థుడుగా కాలంగడపవలసివచ్చిన తను అభంశుభం తెలియనిపసికందుసంపాదనమీద జీవించడమా? ...త్రుటిలో రాజారావువళ్లు చెమటలుపట్టింది. మనస్సు చిత్రవధ జరిగినంత బాధపడింది. అతని కళ్ళయెదుట మురికి గుడ్డల్లో, చెమటలుకక్కుకుంటూ పనిచేస్తున్న తమ్ముడు కనుపించాడు. ఆనాడు ఎలాగో యీ వార్త తెచ్చిన తమ్ముణ్ణి తప్పించుకుని బయటపడ్డాడు రాజారావు. మథనపడ్డాడు, ఆలోచించాడు, తర్కించుకున్నాడు. కాని మరో మార్గం?

రాజారావుకి హిస్టరీలోని క్లైవు, కష్టపడి పైకివచ్చిన జెమినీ వాసన్ గుర్తువచ్చారు. కష్టాలుపడ్డతర్వాత పొందే సుఖమే నిజమైన ఆనందమన్నవిషయాన్ని అతను తోసివెయ్యలేక పోయాడు. తను సముద్రమధ్యంలో వున్నాడు. తప్పనిసరిగా యీది ఒడ్డును చేరుకోవడమా లేక ఆలోచిస్తూ, బాధ పడుతూ, భయపడుతూ, వున్నచోటే మునిగిపోవడమా? ఏది వాంఛనీయం? రాజారావుకున్న నిశితదృష్టి, తార్కికశక్తి భట్టిన అతని కొక నిర్ణయాన్ని సాధించిపెట్టింది. వారం తిరక్కముందే రాజారావు తమ్ముణ్ణి చిల్లరిఅంగడిలో గుమాస్తాగా చేర్చాడు. నెలకు పదిరూపాయలు యిస్తున్న యిల్లు వదిలేసి, అగ్రహారంలో నల్ల చెరువుగొడ్డులో నెలకు ఏడు రూపాయలకు ఒకగది అద్దెకుతీసుకుని అక్కడికి మకాం మార్చాడు. వెనుకటికన్న పట్టుదలతో కథలువ్రాసి పారితోషికం యిచ్చే పత్రికలకుమాత్రమే పంపి, కొంతడబ్బు సంపాదించడం అలవరచుకున్నాడు.......... తనుకూచున్న గానుగచెట్టుకు దక్షిణంగావున్న ప్లీడరుగారియింట్లో గడియారం తొమ్మిదిగంటలు కొట్టడంతో రాజారావు ఆలోచనలకు అంతరాయంకలిగింది. రాత్రి తొమ్మిదిగంటలైందని తెలియగానే ఏదోతప్పుచేసినవాడులా వులిక్కిపడి, వడివడిగా నడిచి యింటిముఖంపట్టాడు.

* * * *

నిశ్శబ్దంగావున్న వీధిలో నడిచివెళ్ళిన రాజారావు ఇల్లుచేరి, వీధివాకిలి తెరచి లోపలకు వెళ్ళాడు. ఆ యింట్లో మధ్యతరగతికుటుంబాలవాళ్ళవి పదికాపురాలుదాకా వున్నా

యి. ఎక్కడివాళ్ళక్కడ నిద్రపోతున్నారు. రాజారావు గుడ్డి దీపాల వెలుగులో తన గదిదగ్గరకు వెళ్ళాడు. వరండాలో రమణ మైమరచి నిద్రపోతున్నాడు. దీపంతగ్గించి గదిగుమ్మం దగ్గర పద్మ కునికిపాట్లుపడుతూ కూచున్నది. రాజారావు ఒక క్షణం ప్రశాంతమైన పద్మముఖంలోకి చూసి అన్నరాకకోసము ఎదురుచూసి చూసి ఆమె నిద్రాదేవిని జయించటానికి చేసిన ప్రయత్నం గమనించి చకితుడయ్యాడు. కొంచెం ముందుకువంగి మృదువుగా పిలిచాడు– పద్మా! అని. పద్మ కొంచెం తొట్రుపడి లేచి చిరునవ్వు నవ్వింది. "ఏమిటి అన్నయ్యా! యింత పొద్దుపోయిందాకా వున్నావు, జగన్నాథంగారింటికి వెళ్లివస్తున్నావా ఏం? "

"లేదమ్మా..." ముక్తసరిగా సమాధానంచెప్పి రాజారావు కాళ్ళుకడుక్కోటానికి భావిదగ్గరకు వెళ్ళాడు. అతనెప్పుడు ఆలస్యంగా యింటికివచ్చినా అతను జగన్నాథంగారింటికే వెళ్ళివుంటాడని పద్మ నమ్మకం. జగన్నాథం కుటుంబముతో తమ కుటుంబానికి కలిగిన సన్నిహితత్వం అటువంటిది. జగన్నాథంలో / వుత్తమ పురుషుడిని, అతని గృహిణి కామేశ్వరిలో ఉత్తమ స్త్రీని చూడవచ్చు. వాళ్ళు మాట్లాడే ప్రతిమాటలో, వాళ్ళ జీవితపు ప్రతిసంఘటనలో మనస్సు, హృదయం, మానవత్వం కనుపిస్తాయి. కామేశ్వరి ఐదారుసార్లు రాజారావుయింటికి వచ్చివెళ్ళింది. ఆమె వున్న కాస్సేపు తమ యిల్లు నవ్వులతో, వెన్నెలతో వెలిగిపోయేది. అరమరికలేని ఆ దంపతుల వాత్సల్యం చూసి పద్మ "అన్నయ్యా! మనకు అమ్మా నానా లేనికొరత

దేవుడు ఈవిధంగా తీర్చాడు ” అన్నది. అరగంటలో రమణ కామేశ్వరిని చిన్నమ్మ చేసుకొని ఆమెచెప్పేకథల్లో కరిగిపోయాడు. జగన్నాథం సమక్షంలోకాని కామేశ్వరిసమక్షంలోకాని రాజారావు మరొక ప్రపంచపు అంచుల్లో పయనించేవాడు. అందుకే ఇవ్వాళ ఆలస్యంగావచ్చినా పద్మ ఛట్టున తన్మనలా ప్రశ్నించింది.

రాజారావు భోజనంచేసివచ్చి తమ్ముడు నిద్రపోతున్న వరండాలోనే పక్క వేసుకుని పడుకున్నాడు. ఆలోచిస్తూనే అతను అన్నం తిన్నాడు. పద్మకూడా ఏమీ మాట్లాడలేదు. అలానే వచ్చి పడుకున్నాడు. ఇప్పుడు గుర్తువచ్చింది రాజారావుకు, ఇంట్లో బియ్యం ఐపోయాయని పద్మ పొద్దునచెప్పిన విషయం. అతనిమనస్సు కలుక్కుమన్నది. వున్న కాసిని గింజలు వండి చెల్లెలు రమణకూ, తనకూ పెట్టిందేమో ! ఐతే పద్మవిషయం ? రాజారావు లేచి మళ్ళీ గదిలోకి వెళ్ళాడు. కిటికీవంక తిరిగి పద్మ గిన్నెలు సర్ది పెడుతున్నది. అన్న లిద్దరూ అన్నం తిన్నారు. గిన్నెలు సర్ది తృప్తితో పస్తుపడుకోవటానికి పద్మ సిద్ధపడుతున్నది. రాజారావు గిరుక్కున తిరిగి వీధిలోకి వెళ్ళిపోయాడు. అతని మనస్సెంతో ఖేదపడింది. ఎడతెగని ఆలోచనలలోపడి తను ముక్కుపచ్చలారని చెల్లెలిని ఎంత కష్టపెడుతున్నాడు. అనాలోచితంగా ఆలోచనలోపడి అర్ధరాత్రి యింటికివచ్చి తన ఆలోచనల్లో పద్మ కనీసఅవుసరాలనుకూడా మరచిపోయి ఆమెకు నిజంగానే తను అశాంతి కలిగిస్తున్నాడు.

రాజారావు బట్టలబజారు సెంటరుకు చేరుకునేప్పటికి మార్వాడీ మిఠాయిదుకాణం కట్టేస్తున్నాడు. లైటు వెలుగులో రాజారావునుచూచి మార్వాడీ చేస్తున్నపని ఆపేశాడు. ఆ మార్వాడీ లాలూరాంతో అతనికి కొంచెం పరిచయం ఉన్నది. మందహాసంచేస్తూ అతడ్నిసమీపించి 'లాలూరాం' అన్నాడు. రాజారావు.

" రండి బాబూ, రండి. అంతా తాజా సరుకే. ఏం కట్టమంటారు ? "

రాజారావు కొంచెం యిరుకునపడ్డా ఛలోక్తిగా అన్నాడు. "నాకేమో తాజాసరుకే కావాలికాని నీకు డబ్బుమాత్రం తాజాగారాదు." వ్యాపారంలో కాకలు తీరిన మార్వాడీకి యీ భాష అర్థంమైంది. రాజారావు సమాధానానికి ఆముదంతాగిన పిల్లవాడిముఖంపెట్టవలసిందే కాని, అంగడిమూసివేస్తున్నసమయంలో మిగిలిపోయినవి గాలిచొరని అంగడిలో బంధింపబడటానికన్న బయటపడటానికే సిద్ధంగావున్న మిఠాయి వంక చూసి ధైర్యం తెచ్చుకున్నాడు. "దానికేంబాబూ! మీకు కావాల్సినవి తీసుకెళ్ళండి. మీకు చెయ్యితిరిగినప్పుడే యివ్వొచ్చు" అని రాజారావు ఏమో చెబుతుండగానే, లాలూరాం పొట్లాలు కట్టడం, అతను పొట్లాలుతీసుకొని. యింటితోవపట్టడం రెండునిముషాలు పట్టలేదు.

అతను ఇంటికి తిరిగి వచ్చేప్పటికి పద్మ పడుకుని మసులుతున్నది. పొట్లాలు టేబులుమీద వుంచుతుండగానే పద్మ లేచి దీపంపెద్దదిచేసింది.

"మళ్ళీ ఎక్కడకు వెళ్లావు అన్నయ్యా... యివన్నీ ఏమిటి? ... మాట్లాడవేం అన్నయ్యా?" అంటూంటే, రాజారావు మాట్లాడకుండా ఒకపొట్లంతీసి పద్మకు యిచ్చాడు. ఆమొముఖంలో ఆశ్చర్యమూ, నవ్వూ ప్రత్యక్షమయ్యాయి. "ఇదంతా ఏమిటి అన్నయ్యా! నాకేం బోధపడలేదు" అంది. రాజారావు తప్పనిసరిగా సమాధానం చెప్పాడు, "కష్టాలు కడుపులోదాచుకోవడం యింతచిన్నతనంలోనే ఎలా నేర్చుకున్నావమ్మా. అన్నయ్యచేసినపని మరచిపోయి, యివి తిని పడుకోమ్మా—" రాజారావు గారాముగా చెల్లెలితల నిమురుతూ, మిఠాయి నోటికిఅందిచాడు. పద్మకు దారితోచలేదు. అన్నయ్యచెయ్యి తోసివేసి, మిఠాయి చేతిలోకి తీసుకుంటూ ఫక్కుననవ్వింది. రాజారావుహృదయంలో మళ్ళీ వెన్నెలలు విరిశాయి. హాయిగా గాలిపీల్చుకొని నిశ్చింతగా పోయి పడుకున్నాడు.

## 2

రమణ పనిచేస్తున్న చిల్లరఅంగడి మెయినురోడ్డుమీద మంచి జనసమ్మర్దంగలచోట వున్నది. రమణకుసాధారణంగా పని ఎక్కువగానే వుంటుంది. ఆ చిల్లరకొట్టు యజమాని శేషావతారం చిత్రమైనమనిషి. అతని స్వభావం తరచు మారుతూవుంటుంది. మంచిమనసుతో వున్నప్పుడు గుమాస్తాలను అభిమానిస్తాడు. బేరగాళ్ళను గౌరవిస్తాడు. మనసు మారినపుడు ఎవరినీ లెక్కచెయ్యడు. వచ్చిన బేరాన్ని తనకు తానై తోసివేస్తాడు. గుమాస్తాలను నానాహింసలు పెడతాడు, ఛండశాసనుడులా ప్రవర్తిస్తాడు. అందువల్లే చిల్లర

కొట్టు వ్యాపారంలో లక్షరూపాయల ఆస్తి సంపాదించిన శేషావతారం ఎంత మంచివాడో, అంత చెడ్డవాడని ప్రతీతి.

దీపావళి శేషనగా ముందురోజు మిగతా గుమాస్తాల మాదిరి రమణకూడా చీకటితోనే కొట్టుకు వచ్చాడు. ఐదు గురు గుమాస్తాలూ కొట్టుకుచేరిన పదినిమిషాలకల్లా తాళాలు తీసుకొని శేషావతారం వచ్చాడు. పెద్దగుమాస్తాచేతికి మూడురూపాయ లిచ్చి, అందర్నీ సుష్టుగా టిఫినుతీసుకొని రమ్మన్నాడు. ముఖ్యమైన ప్రతిపండుగకూ ముందు రెండు రోజులు శేషావతారంకొట్టుదగ్గర యిసుకవేస్తే రాలనంత వొత్తిడిగా జనం చేరి, వ్యాపారం జరుగుతుంది. ఆరోజు కూడా సరిగ్గా అలానే జరిగింది. కొట్టు తెరుస్తుండగానే పది మంది సరుకుకోసం వచ్చారు. తెల్లారగట్ల ఆరుగంటలకు మొదలైన బేరం మధ్యాన్నం రెండుగంటలైనా తెరిపిచిక్క లేదు. ఈలోగా శేషావతారం గుమాస్తాలకు రెండుసార్లు కాఫీ తెప్పించి యిచ్చాడు. సరిగ్గా రెండున్నరకు జరుగుతున్న వ్యాపారంకూడా కట్టిపెట్టేసి, గుమాస్తాలందర్నీ తన యింటికే భోజనానికి పిలుచుకువెళ్లాడు. రమణకు యివ్వాళ ఎందుకో చాలా నీరసంగా వున్నది. భోజనానికి వేళకూడా తప్పింది. తప్పనిసరిగా శేషావతారం యింట్లో రెండుమెతుకులు తిని, అప్పుడే పడుకోవడానికి వెడుతున్న యజమానిదగ్గరకు వెళ్ళి "నాకు వంట్లో చాలా నీరసంగా వున్నది. ఒక్కపూట శెలవు యిస్తే యింటికి వెళ్ళి పడుకుంటానయ్యా" అని విన యంగా అడిగాడు. శేషావతారానికిజాలివేసింది ... రమణ తన కొట్లో చేరినప్పటినుంచీ అతను శ్రద్ధగానే గమనిస్తున్నాడు.

రమణకు దురభ్యాసాలు లేవు; అబద్ధాలు అంతకంటే చెప్పడు. కష్టంవస్తే కాస్తంత భయంకూడా లేకుండా సూటిగా చెప్పేస్తాడు. రమణ చెప్పినదాన్ని చప్పున వప్పుకున్న శేషావతారం, "అట్లానే వెళ్ళు. వంట్లో నెమ్మదిగా వుంటేనే రేపు కొట్టుకు రా. ఆలస్యంగా వచ్చినా నే నేమీ అనుకోను" అంటూ చొక్కా జేబులోంచి పదిరూపాయల నోటు తీసి చేతులో పెట్టి, "పండక్కు ఓ చొక్కా, లాగూ కుట్టించుకోరా. అమ్మా, నాన్న లేరన్నా వుగా" అన్నాడు లాలనగా.

రమణ యింటికి వచ్చేప్పటికి పద్మ వీధివాకిట్లోనే కాచుకునివున్నది. రమణ లోపలికివచ్చి కూచోగానే, "అదేమిటా, నువ్వూ, అన్నయ్యా యిద్దరూ భోజనానికి రాలేదు. నా కేమీ తోచక నిలుచున్నాను. అన్నదమ్ములు పప్పన్నానికి వెళ్ళారా?" అని అడిగింది. పద్మను వుడికించడానికి వీలు దొరుకుతే, రమణ ఒకమాత్రాన వదలడు. ఏమీ తడువు కోకుండా, "అవునే - ఆ పప్పన్నందొరికేరోజుకోసమే ఎదురుచూస్తున్నాం. కాని, మనకోరిక గ్రాంటుచేసేతీరిక దేవుడికి యింకా దొరకలేదు" అన్నాడు రమణ. తెచ్చిపెట్టుకున్నకోపంతో, "ఫోరా, నీకు పనీ పాటా లేదు." అన్నది పద్మ ముసిముసినవ్వులు నవ్వుతూ. పద్మ అన్నది రమణకు వినిపించలేదు. వాడిమెదడులో అన్నయ్యవిషయం మెదిలింది.

"పద్మా, అన్నయ్య నిజంగా యింతవరకూ అన్నానికి రాలేదా?"

"ఐతే, అన్నయ్య నీకు కనిపించలేదా ఏమిటి? జగన్నాథంగారు మిమ్మల్నిద్దర్నీ వాళ్ళయింటికి భోజనానికి పిలుచుకవెళ్ళారేమో అనుకున్నాను" అన్నది పద్మ. "మరి అన్నయ్య ఎక్కడున్నదీ విచారించిరారా ?"

రమణ లేచి చొక్కా తొడుక్కొని, రాజారావు విషయం కనుక్కొనివస్తానని పద్మకుచెప్పి మళ్ళీ జగన్నాథం కోసం బయలుదేరి వెళ్ళాడు.

రమణ లైబ్రరీకి వెళ్ళేప్పటికి జగన్నాథం పనితొందర్లో వున్నాడు. రమణనుచూసి ఒక చిన్ననవ్వుతోనే పలకరించి, కూచోమనిసౌంజ్ఞచేశాడు. పదినిముషాలతర్వాత రమణను లోపలిగదిలోకి పిలుచుకువెళ్ళి "ఏమిటి బాబూ యిలా వచ్చావు? అన్నయ్య యివాళ లైబ్రరీకి రాలేదు; ఇంట్లోనే వున్నాడా?" అని అడిగాడు జగన్నాథం. ఈ ప్రశ్నకు రమణ చకితుడయ్యాడు. "అన్నయ్య విషయం అడిగి తెలుసుకోడానికే మీ దగ్గరకు వచ్చాను. అన్న మీకు కూడా కనుపించలేదన్నమాట. పొద్దున వెళ్ళిన వాడు యింతవరకూ అన్నానికికూడా రాలేదు" అన్నాడు ఎంతో గాభరాగా. జగన్నాథం యీ మాటకు ఎంతో నొచ్చుకున్నాడు. ఎవరికీ చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళేటటువంటిమనిషి కాదు రాజారావు. అతనికి తమ్ముడన్నా, చెల్లెలు పద్మఅన్నా ఎంతో ప్రేమా, వాత్సల్యం. అటువంటివాడు తనకుకూడా చెప్పకుండా, సాయంత్రం ఏడుగంటలదాకా భోజనానికిరాకుండా ఎక్కడికి వెళ్ళిఉంటాడు? జగన్నాథానికి కారణం బోధపడలేదు. కాని అతనికి రాజారావుకున్న స్నేహితులు, అతను

తరచు వెళ్ళే ప్రదేశాలూ బాగా తెలుసు. విచారిస్తే విషయం తెలుస్తుందన్న నమ్మకంతో, రమణను బుజ్జగించి,

"నువ్వేమీ గాభరాపడకు. సాయంత్రంలోగా విచారించి, నీకు కబురుచేస్తాను. స్నేహితులతో ఏదైనా దగ్గర వూరికి వెళితే, తానే తిరిగిరావచ్చు. వెళ్ళి పద్మకుకూడా ధైర్యంచెప్పు బాబూ" అని చెప్పి పంపించారు. లైబ్రరీపని చేస్తున్నా, జగన్నాథం మనస్సులో ఎక్కువభాగం రాజారావుకోసమైన ఆలోచనలతో నిండిపోయింది.

లైబ్రరీనుంచి బయలుదేరివస్తున్న రమణకు జిన్నాటవరుసమీపంలో పండ్లదుకాణందగ్గర అతని పెదనాన్న మాధవయ్య ఏదో బేరంచేస్తూ కనుపించాడు. రమణకు ఆవేశంవచ్చింది. పెదనాన్న. ఒక్కసారి పెదనాన్నను కలుసుకొని, కష్టకాలంలోవున్న తమబాధలు చెప్పుకొని ఆయన సానుభూతిపొందితే మనస్సుకు ఎంత హాయిగావుంటుంది! రమణ ఆలోచిస్తూనే బిగ్గరగా 'పెదనాన్నా' అని కేకవేశాడు. ఈ కేకకు మాధవయ్య తిరిగేమో చూశాడుగాని, చూసీ చూడనట్లు తలతిప్పేసి, రమణను గమనించనట్లు ప్రక్కనే వున్న సైకిలురిక్షాలో ఎక్కి వెళ్ళిపోయాడు. రమణ ఆశ్చర్యానికి అంతులేదు. పెదనాన్నతన కేక విని, తననుచూసి ఎందుకలా వెళ్ళిపోయాడు? ఆర్థికబలంలేని మనిషిని సమాజం ఎంత చిన్నచూపుచూస్తుందో, నల్లేరుమీద బండినడిచినట్లు ఎంత నిర్లక్ష్యంగా తుడుచుకుపోతుందో - జీవితపు తొలిమెట్టులో తారట్లాడుతున్న రమణకు బాగా బోధపడలేదు. మాధవయ్యతో మాట్లాడే అవకాశం దొరకనందుకు నిస్

త్సాహపడి అడుగుల్లో అడుగులు వేసుకుంటూ, నడుస్తున్న రమణకు, బట్టలబజారు సెంటరులో మలుపుతిరిగి అగ్రహారం రోడ్డువంక తిరగ్గానే, రిక్షాలో ఎదురువస్తున్న శేషావతారం కనుపించాడు. రమణ దగ్గరకురాగానే రిక్షాఆపించి శేషావతారం దిగి, "ఏరా ఒంట్లోబాగాలేదని చెప్పి, కొట్టుకు ఎగనామంపెట్టి, వుత్సాహంగారోడ్ల వెంట తిరుగుతున్నావా ...... అని అడిగాడు. తలవనితలంపుగా ఎదురైన శేషావతారంగారి ఎప్పుడూ వూహించని ఈ ప్రశ్నతో రమణ నోట మాటరాలేదు. ఒంట్లో బాగా లేకపోయినా కాలుకు కాలుకొట్టుకుంటూ అన్నజాడ విచారించుకుంటున్న తనను నిలదీసి యజమాని యిటువంటి ప్రశ్న వేయడం ఏమిటి? రమణ నీళ్ళునమలడం చూసి, శేషావతారం మండిపడ్డాడు. "దొంగవెధవ! అబద్ధంచెప్పడానికికూడా ఆలోచించాలా?"

మైకం కమ్మినట్లు స్తబ్ధుడైన రమణ కొంచెం తేరుకుని, "లేదయ్యా, మా అన్న లేడూ, రాజారావు..." అని తన వాస్తవస్థితిచెప్పడానికి ప్రయత్నించాడు. శేషావతారం మాటపూరనియ్యలేదు. నోటికొచ్చినవిధంగా తిట్టుకుంటూ రిక్షాఎక్కి వెళ్ళిపోయాడు. ఈ సంఘటనతో రమణ పూర్తిగా దిగజారిపోయాడు. చికాకైపోయిన మనసుతో రమణ యింటికి చేరాడు. అతను గదిలోకి వెళ్ళేప్పటికి పద్మ నేల మీద పడుకుని నిద్రపోతున్నది. చెక్కిళ్ళమీద కన్నీళ్ళ చారలు మెరుస్తున్నాయి. ఈ స్థితిలో పద్మను లేపడం యిష్టంలేక, భారమైన బాధను బలవంతంగా మరచిపోగలనన్న

పిచ్చినమ్మకంతో రమణకూడా ఒక మూలకు వెళ్ళి ఒదిగి పడుకున్నాడు.

రాజారావు కనుపించకుండా వెళ్ళి వారంరోజులు గడచిపోయింది. ఈమధ్యకాలంలో రమణ, పద్మ పూర్తిగా దిగజారిపోయారు. పద్మ రెండురోజులు సరిగా అన్నమే ముట్ట లేదు. రాజారావు వెళ్లిపోయినరోజునుంచి జగన్నాథం రోజూ ఒకమారు వచ్చి రమణనూ, పద్మనూ విచారించి వెడు తున్నాడు. ఎన్నివిధాల ప్రయత్నించినా రాజారావుజాడ తెలియనేలేదు.

అప్పునికన్నా సన్నిహితంగా తమ మనసులతో పెన వేసుకున్న రాజారావు యిలా వెళ్ళిపోవడం, ఆ పసికందు లిద్దరూ దిక్కు లేనివాళ్ళు కావడం జగన్నాథానికి, కామేశ్వ రికి తీరని విచారంగా నిలచిపోయింది. ఆలోచించగా, ఆలోచించగా జగన్నాథాని కొక విషయం జ్ఞప్తికివచ్చింది. ఎటువంటి పరిస్థితిలోనూ తనకు తెలియజెయ్యకుండా ఏపనీ చెయ్యని రాజారావు, యిలా చెయ్యడానికి తగిన ప్రబల కారణం వుండివుంటుందని అతనికి మొదటినుంచీ నమ్మకము న్నది. కొద్దిరోజులు ఆలోచించినతర్వాత యీ దాగివున్న కారణమేమిటో జగన్నాథానికి దాదాపుగా అర్థమైంది. రాజారావు లోగడ ఒకమారు తనతో యిష్టాగోష్టిగా మాట్లాడుతూ, తన దుర్భరజీవితం భరించడంకన్న, ఆ వూరు వదలి మరేపట్టణానికైనా వెళ్లి, తే, ఎలాగైనా ఒక ఉద్యోగం సంపాదించవచ్చనీ, ఆవిధంగానన్నా తమ్ముణ్ణీ, చెల్లెలినీ వృద్ధిలోకి తేవచ్చనీ తన అభిప్రాయం చెప్పాడు. కాని జగ

న్నాథం యీ విషయంలో రాజారావుపుద్దేశ్యాన్ని ఘట్టిగా విమర్శించాడు. పసికందులను వదలి అలాంటిదుడుకుపనిచేస్తే కలిగే లాభంకన్నా, ఎదురయ్యే చిక్కులే ఎక్కువకావచ్చని తన అభిప్రాయం తెలియజేశాడు. ఆ తర్వాత రాజారావు కూడా ఈ విషయంలో ఎక్కువ వాదించలేదు. జగన్నాథం చెప్పినదానికి తలూపి నవ్వి వూరుకున్నాడు. వెనుకజరిగిన యీ సంఘటన గుర్తువచ్చినతర్వాత. తనకు తెలియకుండా రాజారావు వెళ్లిపోడానికి కారణం జగన్నాథానికి తేలికగా అర్థమైపోయింది.

కామేశ్వరికూడా తీరికచేసుకొని రెండుమార్లు వచ్చి వెళ్ళింది. రెండోసారివెళ్లినప్పుడు పద్మను దగ్గరకుతీసి, "జరిగి పోయినదాన్నిగురించి విచారపడి లాభంలేదమ్మా. అన్నయ్య ఎక్కడో క్షేమంగానే వున్నాడు. ఇవ్వాళ కాకపోతే యింకో వారానికో రెండువారాలకో రావడమో, జాబు వ్రాయ డమో చేస్తాడు. అన్నయ్యవిషయం స్పష్టంగా తెలిసేంత వరకూ నీవూ, రమణా మాయింట్లోనే వచ్చివుండండి. మాకు మటుకేం పిల్లా జల్లా వున్నారు గనుక'' అని ఎంతో ఆప్యా యంగా చెప్పింది. పద్మ కాదనలేదు, అవుననలేదు. రమణ వంక చూసి వూరుకుంది. రమణకు ఈ పద్ధతి నచ్చలేదు. మార్దవమైన కామేశ్వరిమనస్సును తెలుసుకున్న రమణ నవ్వు తూనే సమాధానం చెప్పాడు.

'చిన్నమ్మా, మీ వాత్సల్యం ప్రేమా వుంటే ఎక్కడ వున్నా మాకు భయంలేదు. కొన్నాళ్లు యిక్కడే వుండి, అన్నయ్యసమాచారంకోసం ఎదురు చూస్తామమ్మా.'

కామేశ్వరి యింకేమీ ఒత్తిడిచెయ్యలేదు. ఏదో విధంగా ఆ పిల్లలిద్దరికీ తనకుచేతనైనసహాయం చేయడానికి నిశ్చయించుకుంది. పద్మతోనూ, జగన్నాథంతోనూ మాట్లాడి, పద్మ రోజూ ఆయన భోజనానికి వచ్చేప్పుడు తమయింటికి వచ్చి మిషనుకుట్టుపనీ, హిందీ నేర్చుకునేట్లు మళ్ళీ జగన్నాథమే మధ్యాన్నం లైబ్రరీకి వెళ్లేప్పుడు తీసుకు వెళ్లి ఆమెను యింట్లో దిగబెట్టేట్లు ఏర్పాటుచేసింది. ఈవిషయంలో రమణకూడా ఆసక్తితో ప్రోత్సహించాడు. కామేశ్వరికి తోచిన యీ ఒక్కటి ఆలోచనకు జగన్నాథం ఆమెను చాలా అభినందించాడు.

రమణ మటుకు శారీరకంగా చాలా తగ్గిపోయాడు. జగన్నాథం ఎంత ధైర్యంచెప్పినా, అతను అన్నవిషయం ఆలోచించకుండా వుండలేకపోతున్నాడు. కొట్టువాతావరణం కూడా యిప్పుడు అంత తృప్తికరంగాలేదు. శేషాచలరావు రమణవిషయంలో తన అభిప్రాయాలు మార్చుకున్నాడు. చీటికీమాటికీ చిరాకుపడుతూ, అవదానికీ కానిదానికీ కేకలేస్తున్నాడు.

## 3

రమణను, పద్మను ప్రాణంప్రదంగా చూసుకునే రాజారావు వాళ్ళిద్దరినీ ఒంటరివాళ్ళనుచేసి గుంటూరువదలి వెళ్ళిపోవడానికి తగినంతకారణం లేకపోలేదు. కొంతకాలంగా తమ కుటుంబ పరిస్థితులు తీవ్రంగానే అతను ఆలోచించాడు. ధనికులూ, పలుకుబడికలవాళ్ళూ ఐన తమ బంధువులనుంచి

రవ్వంతైనా సహాయంగానీ, సానుభూతిగాని లభించనిసమయంలో, ఆ యిద్దరిపిల్లలభవిష్యత్తూ తనభవిష్యత్తు మీదనే ఆధారపడి వున్నదన్న విషయాన్ని రాజారావు మరచిపోలేకపోయాడు.

గుంటూరులో వున్నంతవరకూ తనసంపాదన పెంచుకుని కుటుంబస్థితి చక్కబరచుకునే అవకాశం రాజారావుకు ఏమీ కనుపించలేదు. ఇంతకుముందు తనరచనలకు తగిన పారితోషికం పంపిన పత్రికలుకూడా అక్రమంచేస్తున్నాయి. ఎప్పుడో ఏదో పత్రికనుంచి ఐదో ఆరో మనిఆర్డరు రావడం తప్ప, వుపయోగమేమీ కనుపించలేదు. తనకు వుద్యోగం దొరికే విషయంలో ఎంతమాత్రం ఆశలేదు. అన్నివిధాలా ఎడతెరిపిలేకుండా ప్రయత్నాలు చేసి చేసి విసిగిపోయి కూర్చున్నాడు. గుంటూరులో వుండి మరొక వుద్యోగానికి ప్రయత్నంచేద్దామన్న ఆపేకకూడా రాజారావుకుపోయింది. పోతే, రమణకు నెలరోజులు కాళ్ళూ, చేతులూ ఆడిస్తే వచ్చేది పన్నెండురూపాయలు. తమ యిద్దరి సంపాదనా చేర్చినా, యింటిబాడుగ పోతే మిగిలింది ముగ్గురికీ గంజి నీళ్ళకుకూడా చాలదు. చావలేక బ్రతకడమా, బ్రతకలేక చావడమా ?

రాజారావు మనస్సులో జరిగిన యీ సంఘర్షణలో జగన్నాథానికి స్థానంలేకపోలేదు. వాస్తవానికి యీ అనంత ప్రపంచంలో రమణనూ, పద్మనూ మినహాయిస్తే రాజారావుకు జగన్నాథాన్ని మించిన ఆత్మీయుడు లేడు. జగన్నాథంతో ఆలోచించనిదీ, ఆయన సహృదయంతో

యిచ్చే సలహా తీసుకోనిదీ త నేమీ చేయలేనని రాజా రావుకు స్పష్టంగా తెలుసు. గుంటూరులో యింకా కొంత కాలం వుండటంవల్ల పరిస్థితులు మరీ దుర్భరంగా మారడం తప్పదనీ, తను ఏ పెద్దపట్టణానికో వెళ్ళి, ఏదోవిధంగా ఒక వుద్యోగం సంపాదించుకొని, తన పొట్టగడుపుకొని కాస్తో కూస్తో డబ్బు రమణకు పంపడానికి మించిన మార్గం లేదనీ దృఢపరచుకున్న తర్వాత - రాజారావు జగన్నాథందగ్గరకు వెళ్ళి తనమనసును మాటల్లో విప్పిచూపాడు. జగన్నాథం వెంటనే ఔనని, కాదని చెప్పకపోయినా, యోచనచేసి రాజారావు భుజం తట్టి, ఒక చిన్న నవ్వుతెర వదిలి వూరుకున్నాడు. అతను ఏవిషయంలోనూ వెనువెంటనే తేల్చి చెప్పడని రాజారావుకు తెలుసు. జగన్నాథాన్నివదలకుండా.

" నాకు ఆలోచన తట్టగానే మిమ్మల్ని విషయం అడగడంలేదు. కొంతకాలంనుంచో తర్కించుకుని, గత్యంతరంలేని పరిస్థితిలో మీ సహాకోసం వచ్చాను. మౌనంగానే మీరు ఇతరుల మనసులతో మాట్లాడగలరు. కాని యిప్పుడు నాకు కావలసింది మీ నోటిమాటలే. నా దారిని నన్ను వెళ్లమంటారా చెప్పండి ?" అని వినయపూర్వకంగా అడిగాడు రాజారావు.

ఈ విషయంలో సమాధానం చెప్పడంగాని, సలహా యివ్వడంగానీ, కొంచెం బాధగానే తోచింది జగన్నాథానికి. కాని, తప్పనిసరిగా "ఏం చెప్పను. రాళ్ళబాటనుంచి పూల బాటలోకి నడవాలనే ప్రయత్నంలో ముళ్ళబాటలోకి నడుస్తావేమోనని భయంగావుంది." అన్నాడు ముక్తసరిగా, రాజా

రావు యింకేమీ వాదించలేదు. జగన్నాథం యితరులు ఎంతచెప్పినా వింటాడు. తను చెప్పవలసింది కుదించి చెబుతాడు. అందుచేత రాజారావు కొంతసేపు పిచ్చాపాటీ మాట్లాడి వెళ్ళిపోయాడు.

జగన్నాథంకూడా నిరుత్సాహపరచడంతో రాజారావుసమస్య వికటాట్టహాసంచేసింది. వికృతంగా వెక్కిరించింది. కాని అతను సమస్యను మరచిపోలేదు. సాగతీసి, సాధించి ఆలోచించి తనకు కష్టమైనా, యితరులకు నిష్ఠూరమైనా జీవితం చేస్తున్న సవాలును ఎదుర్కోవానికే నిశ్చయించుకున్నాడు.

రోజులు గడిచేకొద్దీ రాజారావులోని సంఘర్షణ తీవ్రరూపం దాల్చింది. ఈలోగా జగన్నాథం రాజారావుకు అనేకవిధాల అనేకసార్లు ఆర్థికంగానూ యితరరకాలుగానూ సహాయంచేయడానికి ప్రయత్నించాడు. కాని రాజారావు అందుకోలేదు. మూభావంగావూరుకున్నాడు. కడుపును కాల్చే ఆకలిని, ప్రాణాన్నితీసే మానాన్ని ఓర్పుతో ఎదుర్కొన్నాడు.

వున్నట్టుండి ఒకనాడు పరధ్యానంగా రైలుస్టేషనుకు వెళ్ళాడు. తెనాలి వెళ్ళేరైలు ఆగిన ప్లాట్‌ఫారంమీద జనాన్ని చూస్తున్న రాజారావుకు ఎప్పుడో ఎక్కడికో వెళ్లాలని తాపత్రయంపడుతున్న తను మద్రాసు ఎందుకు వెళ్ళకూడదు ? అన్నప్రశ్న ఎదురైంది. అవును, మద్రాసు ఎందుకు వెళ్ళకూడదు... ...?

రాజారావు తనను తాను ప్రశ్నించుకున్నాడు. ఎవరికీ చెప్పకుండా, ఏ ఏర్పాటూ చెయ్యకుండానే వెళ్ళాలి. రాజారావులో ఒక్కక్షణం భయం, మరుక్షణంలో ధైర్యం ఎదుర్కొన్నాయి. ఆవేశం యీ రెంటినీ దాటి పైకుబికింది. ఔను, వెళ్ళాలి. కాని టిక్కెట్టుకు డబ్బు? రాజారావు జేబులు తడువుకున్నాడు. ఏమిటో గట్టిగా తగిలితే, తీసి చూశాడు. ఒక్క అణా. ఎక్కడిది? రాజారావుకి గుర్తువచ్చింది, యింటిదగ్గరనుంచి బయలుదేరేముందు ప్రక్కయింటివాళ్ళ అబ్బాయి గాలిపటం కొనుక్కురమ్మని అణాయిచ్చిన విషయం. తనలోతాను నవ్వుకున్నాడు; ఒక్క అణాతో ఏమిటి చేయడం? రైలుకోసం త్వరగా వెళ్ళుతున్న ఒకముసలాయన రాజారావును తోశాడు. రాజారావు వులిక్కిపడి చూశాడు. ప్లాట్‌ఫారంమీద రద్దీ తగ్గిపోయింది. ఎక్కడివాళ్ళక్కడ వెళ్ళిపోయారు. గేటులో ఉన్న టిక్కెట్టు కలెక్టరు జేబులోనున్న టిక్కెట్లు సరిచేసుకుంటున్నాడు. ఖాళీగాఉన్న కౌంటరుదగ్గరకు వెళ్ళి, రాజారావు అణా యిచ్చి ప్లాట్‌ఫారంటిక్కెటు తీసుకున్నాడు. రైలుయింజను కెవ్వుమనికేక వేసింది. రాజారావు పరుగెత్తి వెళ్ళి చివర పెట్టెలో ఒకమూల కూచుని కళ్ళుమూసుకున్నాడు.

రాజారావు ఎక్కిన రైలుపెట్టెలో ప్రయాణీకుల వొత్తిడిఎక్కువగానేవున్నది. పరుగెత్తుతున్నరైలుపెట్టెతలుపు తెరచుకొని తలగుడ్డచుట్టుకొని, చంకలో ఒక చిన్నపెట్టె తీసుకొనివచ్చిన మధ్యవయస్కుడు, కస్తూరిమాత్రలనుగురించి వుపన్యాసమిస్తున్నాడు. చంకకు బుట్టతగిలించుకుని వచ్చిన

మరొకకుర్రవాడు అరచిఅరచి కాలక్షేపం బఠానీలు అమ్ముతున్నాడు. రాజారావుకు ఎదురుబల్లమీద కూచున్న ముసలాయన భగవద్గీతలోని కర్మసిద్ధాంతాన్ని విశదీకరిస్తున్నాడు. కుర్రకారు రాజకీయాలు చర్చిస్తున్నారు. కొందరు అమ్మకానికివచ్చినవాళ్లు చెప్పింది విని కావలసినవి కొంటున్నారు. ఇవన్నీ ఏమీపట్టని రాజారావు మగతలోపడిపోయాడు. రైలు తెనాలిస్టేషనులో ఆగేవరకు మత్తుగా, మౌనంగా ఒదిగికూచునేఉన్నాడు. అతనికి తన శరీరపరిస్థితినిగురించి కానీ, తను చేస్తున్నపనియొక్క పర్యవసానాన్నిగురించికానీ ఆలోచనపోలేదు. ఆ పెట్టెమెయిలుకు తగిలించిన తర్వాతతనదగ్గర టిక్కెట్టులేదనీ, ఏక్షణైనా నాటిక్కెట్టుకలెక్టరువచ్చి పోలీసులకు పప్పగించవచ్చనీ, ఏటికిటోను తనశరీరం చాలా నీరసస్థితిలో ఉన్నదనీ అన్నివిషయాలూ ఒకటొకటిగా రాజారావుకు గుర్తుకువచ్చాయి. కాని ఎందుకో యీ దైన్యస్థితి అతనిని భయపెట్టలేకపోయింది. ఏదోబలీయమైనశక్తితన నిలా లాక్కుపోతున్నట్లు, ఎటువంటి అవాంతరాన్నైనా ఎదుర్కోటానికి తన గుండె కరకుతేలినట్లు రాజారావు ఫీలయ్యాడు. మెయిలు కదులుతుంటే తను తప్పటడుగులువేస్తూ మరొక ప్రపంచంలోకి వెడుతున్నట్లుగా అనిపించింది.

చల్లగాలికి నిద్రపట్టినరాజారావుకు మెయిలు నెల్లూరు స్టేషనులో ఆగినప్పుడు మెలుకువ వచ్చింది. ఆ స్టేషనులో దిగవలసినవాళ్లు దిగిపోతున్నారు. మెలుకువవచ్చి సర్దుకుని కూచున్న రాజారావు కాలికి ఏదో మెత్తగా తగిలింది. చేతిలోకి తీసుకొని చూశాడు. బరువైన మనీపర్సు. పర్సుమీద

'సుగుణకుమార్, పేరగన్ యిండస్ట్రీసు, బొంబాయి' అని బంగారురంగులో అచ్చువేసిఉంది. పాపం ఎవరో పోగొట్టుకొనివుంటారని రాజారావుకు అనిపించింది. క్షణం ఆలోచించకుండా పెట్టెఅంతా కలియచూశాడు. వాకిలిదగ్గర అప్పుడే ఒకయువకుడు చంకలో తోలుసంచీపెట్టుకుని కూలీ వెంట దిగిపోతున్నాడు. ఈ పర్సు అతనిదే ఐఉంటుందని రాజారావుకు స్ఫురించింది. గబగబా తలుపుదగ్గరకు వెళ్ళి 'సార్ సార్' అని చప్పట్లుచరిచి పిలిచాడు. ఆ యువకుడు వెనుతిరిగి చూసి వచ్చాడు. ఇది మీదేననుకుంటా నంటూ రాజారావు పర్సు అందించాడు. మెనీథ్యాంక్సు అని ఆయువకుడు యింకా ఏదో చెప్పబోతున్నాడు. రైలుగంట గణగణ మోగింది. మెయిలు బుసలుకొట్టింది. ఆ యువకుడికి సకాలంలో పర్సు అందించి, సహాయపడగలిగినందుకు అతని మనసు ఉల్లాసంతో పొంగిపోయింది. తనమీద బరువేదో పోయి, శరీరంలో కొత్త ఉత్సాహం ప్రవేశించింది.

హౌరామెయిలు మద్రాసుచేరుకునేప్పటికి ఉదయం తొమ్మిది గంటల యిరవై నిముషాలయింది. రాజారావు మెయిలుదిగి సెంట్రలుస్టేషనులోకి వచ్చాడు. అతనికి మద్రాసురావడం అదే మొదటిసారి. చేతిలో టిక్కెట్టులేదు. కడుపులో ఆకలి అగ్నిహోత్రంలా పెనవేస్తున్నది. ఏమిచేయాలో ఎలా ఎక్కడికి వెళ్లాలో రాజారావుకి తోచలేదు. టిక్కెట్టు లేకుండా ప్రయాణంచేసిన తన స్నేహితులు కొందరు వెయిటింగురూముద్వారా తప్పించుకువెళ్ళడం, గేటులో వుండే టిక్కెట్టుకలెక్టరు వెళ్లిపోయేదాకా హింగిన్ బాధమ్సులో

పత్రికలుతిరగేసి, తరవాత దాటిపోవడంవంటి విషయాలు అతనికి తెలియనివికావు. కాని అలాంటి పనేదీ చేయడానికి అతనికి మనస్కరించలేదు. మరి తరుణోపాయం. పట్టుబడి పోలీసులచేత శిక్షింపబడటమా? ... ఆలోచిస్తూ నిలుచున్న రాజారావును ఒక టిక్కెట్టుకలెక్టరు అనుమానించనే అనుమానించి దగ్గరకు వచ్చాడు.

"మీరు ఎక్కడికి వెళ్ళాలి?" అతను ఇంగ్లీషులో అడిగాడు.

"మద్రాసు" అన్నాడు రాజారావు తడువుకోకుండా యింగ్లీషులోనే.

"టిక్కెట్టు?"

"డబ్బులేక కొనలేదు" రాజారావులో ఏమూలా భయం కనుపించలేదు.

"డబ్బులేకపోతే రైలెందుకు ఎక్కివచ్చావు?" అతను కొంచెం దబాయింపుగానే అడిగాడు.

"అంటే- నడచి రమ్మంటారా?" సమాధానం చెప్ప వలసిన రాజారావు మళ్ళీ ప్రశ్నవేశాడు.

"తెలివికి సంతోషించాను. డబ్బు వున్నప్పుడే రైలులో వచ్చివుండవలసింది !"

"డబ్బుకోసమే అంతదూరం నుంచి మద్రాసు వచ్చాను" అన్నాడు రాజారావు. ఆ టిక్కెట్టుకలెక్టరుకు సమాధానం దొరకలేదు. టిక్కెట్టులేనివాళ్ళెవరైనా తన చేతికి జిడ్డురాయడమో, మాట్లాడకుండా తనవెంట పోలీసు అధికారిదగ్గరకు రావడమో మామూలు. కాని రాజారావు

వంటి కొంటెయువకుడిని అతడెప్పుడూ చూడలేదు. అతనిలో అభిమానం బుసలుకొట్టింది. కోపం ముంచుకువచ్చింది.

"చాలా ప్రియాసపడి మద్రాసు వచ్చావు. తగిన మర్యాద చేయకపోతే తప్పుపడతావు. రా, అత్తవారింట్లో వదిలేస్తాను" అని తనూ కొంటెగానే అంటూ, రాజారావును గుంజుతూ పోలీసుకోసం వెతికి, అతనికి వప్పచెప్పి వెళ్లిపోయాడు. రైల్వేపోలీసు తీక్షణంగా రాజారావుముఖంలోకి చూశాడు. చదువుకున్నవాడూ, జేబులో పైసా లేనివాడూ అని క్షణంలో పసిగట్టాడు. మారుమాట్లాడకుండా రాజారావును తీసుకువెళ్లి పోలీసుఅధికారికి వప్పచెప్పాడు.

రాజారావు చేతులుకట్టుకుని పోలీసుఅధికారి ఎదుట నిలుచున్నాడు. అధికారి బాగా వయసుమళ్లినవాడు. తల బాగా నెరసింది. మనుషులను శిక్షించడమేకాక, మనుషుల మనస్తత్వాలను అర్థంచేసుకోవడానికి చేస్తున్న ప్రియత్నం, గతజీవితంలో ఆయన పొందిన అనంతమైన అనుభవం ఆయన ముఖంలో స్పష్టంగా గోచరిస్తుంది. రాజారావు అధికారిని చూసి భయపడలేదు. ఆయన ముఖాన్నీ, లోతైన కళ్ళను చూస్తూ కొత్తఅనుభూతులు పొందాడు. ఇంకా అలానే చూస్తూ వుండాలనుకున్నాడు. పోలీసుఅధికారికికూడా రాజారావుముఖంలో భయంకాని, తప్పుచేసినవాడు పడే ఆవేదనకాని, కనుపించలేదు. రోజూ చేస్తున్నపనుల్లో ఏదో ఒకపని చేసి అలసి, ఆగి సేదతీర్చుకుంటున్నవానిలా కనుపించాడు.

అధికారి రాజారావును దగ్గరకు పిలిచి, "నీవు చాలా తప్పుపని చేశావయ్యా" అన్నాడు.

రాజారావు తడుముకోకుండా, "ప్రభుత్వ దృష్టిలో" అన్నాడు.

అధికారి మెల్లిగా నవ్వి "పొరపాటుపడ్డావు. తప్పు ఎప్పుడూ ప్రభుత్వ దృష్టిలోనే నిర్ణయింపబడుతుంది. సమాజంలోని వివిధమనుషుల దృష్టినుంచి తప్పొప్పులు నిర్ణయింపబడవు" అని చిన్న దగ్గుతెర రాగా కొంచెం ఆగి అందుకున్నాడు, "నీ బాధ నాకు తెలుసు. నీవున్న వాతావరణం, నీ పరిస్థితులు, నీ మానసికస్థితి నీవు చేసినపనికి కారణమంటావు, వాస్తవమే. కాని ప్రభుత్వ విధినిర్వహణలో వీటికి స్థానంలేదు. నీమీద యిప్పుడు రిపోర్టు వ్రాయడం, నిన్ను మేజిస్ట్రేటు ఎదుటకు పంపడం నా విధి,"

రాజారావు తనతొందరపాటుకు సిగ్గుపడ్డాడు. "క్షమించండి. మీ విధి నిర్వహించండి. సిద్ధమే" అన్నాడు.

పోలీసుఅధికారి సిగరెట్టు ముట్టించుకొని, పొగపీల్చి వదలి, రాజారావుకళ్ళలోకి చూసి అన్నాడు, "నిజం చెబుతున్నాను. నేరస్థులకళ్ళలో తరచు కనుపించే భయం, వగలు, ఆవేదన నీలో నాకు కనుపించలేదు. వుదాత్తమైన పశ్చాత్తాపమేదో కనుపిస్తున్నది. నిన్నుచూస్తూ మరచిపోయిన ఏదో మధురమైన అనుభూతిపొందాను. వెళ్ళు నాయనా, నీవుచేసిన పొరపాటుకు రైల్వేవారికి చెందవలసిన డబ్బు నేనే చెల్లిస్తాను."

రాజారావు చకితుడయ్యాడు. అతనిలో కృతజ్ఞత పెల్లుబికింది. ఆ అధికారిదగ్గరకు వెళ్ళి కుప్పలాకూలి ఆయన చేతుల్లో తలవుంచి గావురుమన్నాడు.

# 4

రాజారావుపరిస్థితిని కొంతవరకు అర్థంచేసుకున్న పోలీసుఅధికారి, అతను వెళ్ళిపోయేముందు చిల్లరఖర్చుకు గాను వుంచుకోమని ఐదురూపాయలు యివ్వబోయాడు. కాని రాజారావు డబ్బుపుచ్చుకోలేదు. కృతజ్ఞతతో వందనాలు చెప్పి, సిగ్గుతో కాలిపోతూ, నడిచివెళ్ళి సెంట్రిలుస్టేషను బయట నిలుచున్నాడు. కార్లు క్షణానికొకటి దూసుకుపోతున్నవి. ప్రతిమనిషి ప్రతిక్షణం విలువైనదేనన్నట్లు పరిగెత్తినట్లుగా నడచివెళుతున్నాడు. మానవజీవితంలో, ప్రపంచ గమనంలో సంఘర్షణకున్నస్థానం గుర్తుకువచ్చి రాజారావు తనలోతాను నవ్వుకున్నాడు. ఇంక క్షణంకూడా నిలువకుండా రోడ్డువెంట నడకసాగించాడు.

గమ్యస్థానంలేని రాజారావు అక్కడక్కడా రోడ్లు మారుతూ జార్జిటవునులోని అన్నాపిళ్లెవీధికి వచ్చేప్పటికి సరిగా పదకొండుగంటలయింది. క్రిందటిరోజునుంచీ భోజనం లేక కడుపులో ఆకలి పెనవేస్తున్నది. కళ్ళు లోపలకు పీక్కుపోయాయి. వంటిమీద బట్టలు చమటకు ప్రయాణానికి మురికి పట్టి వాసనకొడుతున్నాయి. ఆకలిబాధతీరే మార్గమేమిటని ఆలోచిస్తూ అన్నాపిళ్ళెవీధిలో కొంతదూరం వచ్చిన రాజారావుకి ఒక మార్వాడీ నూలుకొట్టుదగ్గర బీదాబిక్కీ క్యూలో నిలుచునివున్నదృశ్యం కనుపించింది. అక్కడ ఆగి ఆవిషయమేమిటో తెలుసుకుందామని ఆసక్తితో చూశాడు.

మార్వాడీకొట్టుకు ముందుభాగంలోవున్న రెండు పెద్ద గంగాళాలనుంచి పులుసూ, కూరా కలిపిఉన్న అన్నంపొ

యిద్దరుమనుషులు ముద్దలుగాచేసి క్యూలో నిలుచున్న వారికి ఒక్కొక్కరికి ఒక్కొకముద్ద యిచ్చి పంపుతున్నారు. కమ్మనివాసనవస్తున్న అన్నం చూశాక రాజారావుకు తెరలు తెరలుగావస్తున్న ఆకలి రెచ్చిపోయింది. ఆవేశంలో ఛట్టున వెళ్ళి ముద్దలుకలుపుతున్నవాడి చేతిలోనుంచి ఒక్కముద్ద లాక్కుని తిందామా అని ఒక వంక, ఆలస్యంచేయకుండా వెళ్ళి క్యూలోనిలుచుని నిదానంగానైనా ఒకముద్ద అందుకుని తిని, ఆకలిచల్లార్చుకుందామని మరోవంకా అతనికి అనిపించింది. కాని మరుక్షణంలో అభిమానం బుసలుకొట్టింది. యింతబ్రతుకూ బ్రతికి, బిచ్చగాళ్ళలో నిలుచుని చేయి చాచి ముద్ద అందుకోవడమా! ఈఆలోచన అభిమానాన్ని తొక్కిపట్టింది పరిసరవాతావరణాన్ని. పరిస్థితులనుబట్టేమానాభిమానాలనుగురించి ఆలోచించాలి. రెండు రోజులనుంచి మెతుకుకొరకని నీవు ఆకలికి ఆహుతైపోయేకన్నా, ఆ కవళం అందుకుని కడుపు నింపుకొని, తరువాత విషయం చూసుకోవడం వుత్తమం. రాజారావు ఆలోచనకూ, అభిమానానికీ మధ్య చిక్కిపోయాడు. క్యూలో నిలుచున్న ఒక యువకుడు పరధ్యానంగా నిలుచున్న రాజారావును చూసి. "ఎన్నా తంబీ, సుమ్మా పాకరది. ఇన్నికీ ఆలు నరీయా యిరికాదు. అంగె పోయి క్యూలో నిక్కుడు." అన్నాడు. రాజారావుకు యీ గోడు అంతగా అర్థంకాలేదు. ఏమైనా తనను వెళ్ళి క్యూలో నిలుచోమన్నాడనిమాత్రం అర్థంచేసుకున్నాడు. రాజారావు యిహ ఆలస్యంచేయలేదు. వుప్పెనలావచ్చిన ఆకలిధాటికి తట్టుకోలేక చరచరా వెళ్ళి క్యూలో నిలుచున్నాడు. మత్తె

క్కిన పాములా మెల్లిగా క్యూ ముందుకు కదులుతున్నది. రాజారావు క్యూలో నిలుచున్న కొంచెంసేపటికి వెనకకు తిరిగి చూశాడు. తనవెనుక యింకో పదిమందిదాకా అభాగ్యులు నిలుచున్నారు. మార్వాడీగుమాస్తాలు పంచిపెడుతున్న ముద్దలు తనదాకా వస్తే చాలనే, క్యూలో నిలుచున్న ప్రతివాడూ అనుకుంటున్నాడు.

సరిగా పన్నెండుగంటలు కొడుతుండగా క్యూలో నిలుచున్న రాజారావు గంగాళాలదగ్గరకు వచ్చాడు. గుమాస్తాలు ఒకముద్దతీసి రాజారావుకు ముందున్నవాడికి అందిచ్చారు. రాజారావువంతు వచ్చింది. పెద్దగుమాస్తా గంగాళాలవంక చూసి, చేతులు దులిపి 'ఐపోచి' అంటూ లోపలకు వెళ్ళిపోయాడు. ఒక్కకవళం అందుకోడానికికూడా నోచుకోని తన దురదృష్టాన్ని నిందించుకుంటూ అతడు వెనుతిరిగి సాగిపోయాడు.

ఒకముద్దఅన్నానికే ఆశాభంగం పొందవలసివచ్చిన రాజారావు బాగా నీరసించిన శరీరంతో మరికొంతదూరం నడిచి 'వసంతవిహార్' హోటల్ దాకా వచ్చాడు. ఇహ ఒక్కఅడుగుకూడా ముందుకుపడలేదు కడుపులో మంటలు బయలుదేరాయి. శోషవచ్చి కళ్ళుతిరిగి నిలుచున్నచోటే కుప్పలా కూలిపోయాడు. హోటలుకు ఆరోజు శెలవుకావడం వల్ల అంత రద్దీగాలేదు. వీధిన వెళ్ళేవాళ్ళు నలుగురైదుగురు రాజారావు పడిపోవటం చూసి దగ్గర గుమికూడారు ప్రతి వాడూ 'అయ్యోపాపం!' అన్నవాడే కాని, ఒక్కరూ ఏ చర్యా తీసుకోలేదు.

హోటల్‌కుఎదురుగా ఓప్రక్కన కూచుని తమలపాకులు అమ్ముకునే రమణయ్యను యీ దృశ్యం ఆకర్షించింది. తన ఆకులతట్టకు ప్రక్కనేవున్న నీళ్ళకుండ తీసుకొని హోటలు ముందుకు చరచరా వెళ్ళి జనాన్ని తొలగించుకొని, ఒక్కక్షణం పడిపోయిన రాజారావు ముఖంలోకి తీక్షణంగా చూసి, విచారవదనంతో ప్రక్కనేకూర్చుని కుండలోనినీళ్ళు కొంచెంగా తీసుకొని ముఖంమీద చల్లాడు. కొద్దిక్షణాల్లో రాజారావు కదిలాడు. రమణయ్య అతనిని లేవదీసి, అరుగుమీద కూర్చోబెట్టి, బాగా బ్రతికిన కుటుంబంలో పుట్టినవాడని, ముఖకవళికలవల్ల గ్రహించి "కాలేకడుపును చేతబట్టుకొని ఎక్కడినుంచోవచ్చినట్లున్నావు. కాలం కలిసి రానప్పుడు కడుపునింపుకోడానికికూడా కాస్త అన్నం దొరకదు బాబూ" అన్నాడు.

మానవుడిజీవితాన్ని కాలానికి, కర్మకూ వదిలివెయ్యడం రాజారావుకు యిష్టంలేదు. జీవితగ్రంథపు తొలిపుటల్లో యువకులందరనూ మత్తెక్కించినట్లే, రాజారావులో కూడా భౌతికవాదం పెల్లుబికిపోతున్నది.

"కాలం ఏంచేస్తుందండి. మన ప్రస్తుత సమాజవ్యవస్థ, ఆర్థిక అసమానత్వం,విద్యావిధానం అలా తగులడిపోయాయి. హద్దూపద్దూలేకుండా పెరిగిపోతున్న బీదతనానికి, నిరుద్యోగానికి భగవంతుడే కారణమంటారా ?" అన్నాడు.

వాదించడానికి సమయంకాదని రమణయ్య ఇంకేమీ మాట్లాడలేదు. విషయాన్నిమార్చి, "లే బాబూ, దగ్గరలోనే మా యిల్లువుంది. కొంచెంసేపు విశ్రాంతితీసుకొని

తరువాత వెళ్ళుదువుగాని" అన్నాడు. అపరిచితుని ఆహ్వానాన్ని అందుకోవడమా లేదా అన్న ఆలోచనలోపడ్డాడు రాజారావు. రమణయ్య యీ సందిగ్ధస్థితి గమనించి, చిరునవ్వునవ్వి, తన వ్యాపారం ఆరోజు ఎలాగూ ఐపోవడంవల్ల తన కాళీబుట్టలను తీసుకొనివచ్చి, "మీ వంతగా ఆలోచించవలసినపని నే నేం చెయ్యడంలేదు." అంటూ రాజారావు భుజంమీాద చెయ్యివుంచి అన్నాపిళ్ళెవీధి నాలుగవ సందులోవున్న తనగదికి తీసుకువెళ్ళాడు.

ప్రొద్దున్నే అన్నంవండుకొని తిని, ఆకులు అమ్ముకోడానికి వెళ్ళి, మళ్ళీ మధ్యాన్నం వచ్చి, అన్నంతినడం రమణయ్యకు అలవాటు. తనకోసం వుంచుకున్న అన్నం వడ్డించి రాజారావుప్రక్కనే కూచుని కబుర్లుచెబుతూ, అతని పూర్వచరిత్ర తెలుసుకుంటూ భుజింపచేశాడు రమణయ్య. భోజనంచేసి రమణయ్య వేసిన చాపమీాద కూచుని, "ఇంట్లో ఆడవాళ్ళే కనుపించరేం పెద్దయ్యా ?" అని కలుపుగోలుగా అడిగాడు రాజారావు.

"ఆడవాళ్ళే కారు, నాకు 'నా' అన్నవాళ్ళెవరూ లేరు బాబూ. పడిపోయిన కోటలోని చీకట్లో కాలంగడిపే గబ్బిలంలాంటిది నా బ్రతుకు" అన్నాడు రమణయ్య ఎంతో ఆసక్తితో తనవిషయం తెలుసుకోవాలనుకున్న రాజారావు కళ్ళలోకి చూాస్తూ.

"ఔను, జీవితం మనంచెప్పినట్లు వినదు," రాజారావుకు రమణయ్యకష్టగాథ, అతను చెప్పకుండానే కొంత వరకు బోధపడింది.

"వింటుందనే అనుకుంటారు, వయసువున్న నీవంటి యువకులు."

ఈ మాటతో రాజారావులో ప్రచ్ఛన్నంగా పురకలు వేసే వ్యూహాలు కొంచెం కదిలాయి. రమణయ్యమాటల్లోని యదార్థాన్ని గ్రహించే ప్రయత్నంలో కొంచెం తలవంచుకుని ఆలోచనలోపడ్డాడు. కొంచెంసేపట్లో తేరుకుని రమణయ్యజీవితగాథ వినడానికి వుత్సుకతచూపాడు. అతను ఆవేశంతో చెప్పుకపోయాడు.

రమణయ్యకూడా కలిగినకుటుంబంలో పుట్టినవాడవడంచేత ఆస్తిపాస్తులతోనే సంసారం గడిపాడు. కాని పరిస్థితులు తారుమారై చీకటిముసుగులా దురదృష్టం అతని జీవితాన్ని కప్పివేసింది. పుట్టి, పెరిగి ఆశలుపెంచి నిరాశలో వదిలిపోయాడు ఒక్కగాను ఒక్కకొడుకు. పిల్లలులేని బాధకన్నా, పుట్టిపెరిగిపోయిన బాధ భరించలేక అతని భార్య విషజ్వరానికి గురిఅయింది పెళ్ళాన్ని రక్షించుకోడానికి వున్న ఆస్తంతా కరగించి మందులుగా పోశాడు. కాని ఆవిడకూడా రమణయ్యను ఎడారిలో వదలి మమతతీరకేనేమో కొడుకుదగ్గరకి వెళ్లిపోయింది. క్షణక్షణం గుండెలనుపిండే పరిచితవాతావారణాన్ని భరించలేక అతను మద్రాసు వచ్చి, కడుపుకోసం తమలపాకులఅమ్మకం ప్రారంభించాడు.

రమణయ్యనుగురించి తెలుసుకున్నతర్వాత జీవితంలో వచ్చే విపరీతమైనమార్పులకు మానవుడే కారకుడా లేక అతీతమైనశక్తి అనంతమైనశక్తి ఏదేనా ఉన్నదా అని ఆలోచనాధీనుడైనాడు. ఏమైనా, తాను ఎలాగో

కష్టాల నెదుర్కొని ఏదో సాధించాలనే నిర్ణయాని కొచ్చాడు. ఈ తలంపుతోనే ఎక్కడికో తెలియకుండానే లేచి "వెళ్లొస్తా పెద్దయ్యా" అని బయల్దేరబోయాడు.

రమణయ్య విస్తుపోయి చప్పున రాజారావుచేయి పట్టుకొని "ఎక్కడికెళ్తావు బాబూ? దేశంలో ఎన్నిసంపద లున్నా, కలవారు లేనివారిని చూచి ఈసడిస్తారేగాని, చేర దీసి ఆశ్రియమిచ్చి బ్రతుకుదెరువుకు దారిచూపరు. దరిద్రించే దారిగానక ఏదో యిటొచ్చి పడ్డావు. కష్టంలోవున్న నీకు నేను దగ్గరివాడినే బాబూ. ని బ్రతుకు తెరువుకు ఏదైనా మార్గం ఆలోచిద్దాం. కొద్దిరోజులు యీ అభాగ్యుడియింట్లో వుండ డంవల్ల నీ కేమీ నష్టంలేదు. కానిలాభం కలుగవచ్చేమో"

రమణయ్య చెప్పినదానికి రాజారావు కాదనలేక పోయాడు. రమణయ్యలో ఏదో ఆకర్షణవున్నది. కళ్ళలో జిగేల్ మనే వెలుగువున్నది. మాటలలో మధురిమ వున్నది. అనుభవంతో పండిన మనిషిలో ఆదర్శం విరియబూస్తుందే మోననుకున్నాడు రాజారావు

నాలుగురోజులు గడిచాయి. రాజారావు రమణయ్య నీడలో నీడై తిరిగాడు. అతనిని నవ్వించి తను నవ్వాడు. ఎన్నడూ పొందని కొత్త అనుభూతులు పొందాడు. కోల్పో యినశక్తిని పొందినట్లు అతనిశరీరం వుత్సాహాభరితమైంది. ఆందోళనపడినమనస్సు కుదుటపడి వుల్లాసంపొందింది.

రాజారావు గుంటూరువదలి వెళ్ళినదిమొదలు అత నికి రమణ, పద్మల విషయం ఏమీ తెలిసేఅవకాశం లేక పోయింది. తెలుసుకోడానికి తను ప్రయత్నించకపోయినా

అంతర్గతంగా మనస్సు రమణ, పద్మలనుగురించి ఆలోచిస్తున్నది. చెల్లెలూ, తమ్ముడు కోసం తను బాగా బాధపడినప్పుడు, చిరునవ్వులుచిందులాడే జగన్నాథంముఖం కనుపించినట్లయి, తను కొద్దిరోజులు వాళ్ళిద్దరినీ మరచిపోగలననుకునేవాడు. అందువల్లనే మద్రాసువచ్చిన రాజారావు రమణకుగాని, జగన్నాథానికిగాని ఒక్క కార్డుకూడా వ్రాయలేదు. ఈ పరిస్థితులలో తన ఆచూకీ వాళ్ళకు తెలియడంవల్ల కలిగే ప్రయోజనంకన్నా, ప్రమాదమే ఎక్కువ కావచ్చని అతని తలంపు. గుంటూరు పోస్టుమాస్టరుకుమాత్రం తనకు వచ్చే వుత్తరాలు, రమణయ్య కేరాఫుకు, మద్రాసు త్రిప్పిపంపమని ఒక కార్డు వ్రాశాడు.

తమపాకులబేరం ఒకవంక చూసుకుంటూనే, తెలిసిన వాళ్ళను వాకబుచేస్తూ రాజారావుకు ఏదో ఒక చిన్న వుద్యోగం సాధించాలని రమణయ్య గట్టిప్రయత్నమే చేశాడు. రాజారావు దరఖాస్తులు టైపుచేయించి, పది పన్నెండు పెద్ద కంపెనీలకు వెళ్ళి 'నో వేకన్సీ' బోర్డులుచూసి తిరిగివచ్చాడు.

ఆరోజు రమణయ్య నాలుగుగంటలకల్లా కాళీబుట్టలు తీసుకొని యింటికి తిరిగివచ్చాడు. ఏదో యింజనీరింగ్ కంపెనీలో కాళీవున్నదని విని, మాంటురోడ్డు వెళ్ళివచ్చిన రాజారావు, అప్పుడే ముఖంకడుక్కుని తుడుచుకుంటున్నాడు. రమణయ్య ఒకమూలగా కాళీబుట్టలు పెట్టి దగ్గరగా వెళ్ళి, "ఏమైంది ?" అన్నాడు.

"మామూలైంది" తన సమాధానానికి రాజారావు తానే నవ్వుకున్నాడు.

"ఏమిటి ?" రమణయ్య అడిగాడు.

"ఆశతో వెళ్ళి, నిరాశతో తిరిగిరావడం."

"కాదు ఆశతో వెళ్ళి, ఆశతోనే తిరిగిరావడం"

"అదేమిటి ?" రాజారావుకు యీధోరణి ఒక మాత్రాన అర్థమవలేదు.

"ఔను," రమణయ్య చెప్పుకపోయాడు. "నేను యివ్వాళ్ళ చేసినప్రయత్నం ఫలించింది. హోల్ సేల్ పండ్ల వ్యాపారంచేసే నాకుతెలిసిన ఒక ఆసామిదగ్గర నీవిషయం చెప్పాను. ఎల్లుండి సోమవారంనుంచి నీకు గుమాస్తాపని యిస్తానన్నాడు."

రాజారావును యీవిషయం అంతగా ఆశ్చర్యపరచ లేదు. ఆనందం అంతకన్నా పొందలేదు. వుద్యోగం వస్తుం దన్న తలంపు రాజారావును సంతోషపరచలేకపోవడానికి తగిన కారణాలే వున్నయ్. ఆశాజీవిగా బ్రతకడం మానవుని కర్తవ్యమని రాజారావు వప్పుకున్నా, యీ నగ్నసత్యం అతని కొద్ది అనుభవంలో రుజువుకాలేదు. తను ఆశించినపని ఒకటీ జరుగలేదు. వస్తున్నవని, వచ్చినవని నమ్ముకున్న ఎన్నో వుద్యోగాలు కలల్లా కరిగిపోయాయి. అప్పటినుంచి రాజారావు, వచ్చింది మనదికాని, రానున్నది మనదో మరె వరిదో – అన్న సత్యానికి తన మనసులో స్థానమిచ్చాడు.

ఉద్యోగంవస్తుందన్న ఆలోచన రాజారావులో ఏ మార్పూ తేలేకపోవడం నిజంగా రమణయ్యను చకితపరచింది. కాని, మనుషులమనసులను అర్థంచేసుకోవడం అసాధారణ విషయమని గుర్తువచ్చి తమాయించుకున్నాడు.

# 5

అన్న భోగట్టా యింతలో తెలియదన్న నిర్ణయానికి వచ్చినతర్వాత రమణ చాలా మారిపోయాడు. క్రమంగా అతనిమనసులో ఆలోచన, కళ్ళలో కాంతి, మాటలవెనుక పట్టుదల, ఓర్పు పెరిగాయి. కష్టాలకు అతనిమనసు బాధపడ్డా వివేకం అతనిలో ధైర్యాన్ని పెంచింది. శీలవంతుల జీవితాల్లో వచ్చే మార్పు మంచికోసమేనని రమణవిశ్వాసం. అన్న తననూ, పద్మనూ వదిలివెళ్ళడం తానున్న ఏదో ఒక మంచిమార్పుకు ప్రథమసూచనని ఎందుకో రమణ చిన్ని బుర్రకు స్ఫురించింది. అన్ననుగురించి తనమనసు వంచన చేయలేదు. వాస్తవానికి రాజారావు వెళ్ళినప్పటినుంచే తామిద్దరికీ అన్నమీదగల ప్రేమ, గౌరవం సువిశాలమయ్యాయి.

పద్మ రాజారావుకోసం బెంగపెట్టుకున్నది. అన్నయ్య ఎక్కడవున్నాడో, ఎలావున్నాడోనని మాటిమాటికీ రమణతో వాపోయేది. రమణ పద్మలో చురుకుపాలు పోసి, ఆమె ఖిన్నవదనంలో నవ్వులువెలిసేలా చేసేవాడు. పద్మ ఆలోచించి ఆలోచించి రమణను పిలిచి, "అన్నయ్య యిహ ఎప్పుడైనా మనకు కనుపిస్తాడా?" అన్నది.

రమణ బిగ్గరగా నవ్వాడు. పద్మకు ఏమీ అర్థంగాక వెర్రిగా చూసింది. రమణ ముద్దుగా పద్మతలపట్టుకుని, మెల్లిగా కదిపి, "అన్నయ్య - చదువుకున్నవాడు. తెలివైనవాడు. ఎక్కడున్నా ఏదో మంచి ఉద్యోగంలోనో, వ్యాపారంలోనో వుండివుంటాడు కాని - ప్రమాదంలో ఏమీచిక్కుకోడమ్మా" అని నేర్పుగా సమాధానం చెప్పాడు.

రమణచెప్పింది తృప్తిగా విని, "పోనీ, ఒక్కజాబైనా వ్రాయకూడదా?" అని అడిగింది పద్మ.

రమణ వెంటనే అన్నాడు, "అలా ఎందుకనుకోవాలి. మనకు జాబువ్రాయడంకన్నా చాలా అవసరమైనపనులు అన్నయ్యకు వున్నవేమో!" ఈమాటతో పద్మ కొంచెం వుత్సాహంపొందింది. అన్నయ్య ఎక్కడో దూరదేశంలో వున్నాడు; పెద్ద ఉద్యోగంచేస్తూ ఎప్పుడో వచ్చి కనుపిస్తాడు- అని తనను తాను ఓదార్చుకునేది.

జగన్నాథం రమణ, పద్మలను ఒక కంటకనిపెడుతూ వాళ్ళిద్దరికీ రాజారావు లేనిలోటు లేకుండా చేయటానికి హృదయపూర్వకప్రయత్నంచేశాడు. రాజారావుమీదకన్నా ఈ పిల్లలిద్దరిమీదా తన మమతను ఆదరాన్ని పెంచుకున్నాడు.

యదార్థానికి పిల్లిద్దరినీ తీసుకువెళ్ళి తమఇంట్లోనే వుంచి వృద్ధిలోకి తీసుకురావాలని జగన్నాథం ఉద్దేశించాడు. కామేశ్వరి తక్షణం సుముఖతచూపి ప్రోత్సహించింది. జగన్నాథానికి ఆర్థికంగా ఏలోటూలేదు. చిన్నప్పుడే తండ్రిని పోగొట్టుకున్న తను ముసలితల్లికోసం తనకు ముప్ఫయిసంవత్సరాల వయస్సు వచ్చేవరకు స్వగ్రామమైన తెనాలితాలూకాలోని పల్లెటూరులోనే వున్నాడు. సంసారం గడిచి కాస్తో కూస్తో వెనకవేసుకోడానికి ఆదాయంవచ్చే భూమి వున్నా, జగన్నాథానికి థర్డుఫారానికిమించి చదువుకునేయోగం లేకపోయింది. కాని అతను దిగజారిపోలేదు. పట్టుదలతో స్వతంత్రంగా కృషిచేసి, పట్టభద్రులను తరిఫీదుచేయగలిగినంత విజ్ఞానాన్ని పొందాడు. తల్లి మరణించినతర్వాత గుంటూరు

చేరి విజ్ఞానతృష్ణతో, మనోవికాసంకోసం లైబ్రేరియన్‌గా చేరాడు. కనుకనే అతను గ్రంథాలయంలో నౌకరుగాగాక, జ్ఞానిగా, ప్రేమమూర్తిగా, ఆదర్శవాదిగా గ్రంథాలయకమిటీ వారు, పాఠకులు ఎప్పుడో గుర్తించారు.

జగన్నాథం గ్రంథాలయంలో చేరిన తొలిరోజుల్లోనే పుస్తకాలకోసం వచ్చిన కామేశ్వరితో పరిచయమైంది. ఆవిడ తనను బాగా ఆకర్షించింది. తను అర్థంచేసుకోడానికి ప్రయత్నించి ఆవిడమాటలను మననంచేసుకొని మనస్సులో తొంగి చూశాడు. కామేశ్వరి ఉదాత్తహృదయంగలదే. పట్టభద్రురాలు. భర్త చనిపోయి, దిక్కులేనిదై స్త్రీపాఠశాలలో ఉపాధ్యాయినిగా పనిచేస్తున్నది. పరిచయం పరిధులు దాటి ఆత్మీయతను పెంచింది. మనసులు పెనవేసుకున్నాక మాటా మాటాసందున జగన్నాథంకళ్ళు, కామేశ్వరికళ్ళు తమ భాషలో మాట్లాడుకున్నాయి. బహూ క్లిష్టమయిన ఏర్పాటుతో కామేశ్వరి జగన్నాథానికి గృహిణిగా మారి ఉద్యోగానికి స్వస్తిచెప్పి తనయింట్లోనే బాలికలకు ఉచిత సంగీత బోధన ప్రారంభించింది. ఇటువంటిగృహిణిని పొందగలిగిన జగన్నాథానికి మంచిని పెంచుకోడం ఒక అలవాటైపోయింది. ఈ కోణంలోనే జగన్నాథం రమణ, పద్మల విషయం ఆలోచించాడు. కాని రమణ తనసహాయంపొందుతూ వేరుగానే వుంటామన్న అభిప్రాయం సూచించిన తర్వాత తను ఇంకేమీ ఒత్తిడిచేయలేదు. మనసుకునచ్చిన పనికి మార్గం తప్పక దొరుకుతుందనీ, ఆ పిల్లలిద్దరికష్టాలు కాజాలవు

కుటుంబాన్ని ఆదుకోవాలనుకున్న తమకొక సదవకాశమనీ జగన్నాథం తృప్తిపడ్డాడు.

పద్మ రోజూ జగన్నాథం భోజనానికి వెళ్ళేటప్పుడు అతనితో వారియింటికి వెళ్ళి కుట్టుపనీ, హిందీ నేర్చుకుని సాయంత్రానికి తిరిగివస్తున్నది. ఇంటికి తిరిగివచ్చేవేళ లేనప్పుడు, కామేశ్వరికి తను సహాయపడవలసిన అవసరంకానీ, అవకాశంకానీ కలిగినప్పుడు వాళ్ళయింట్లోనే ఆరోజు వుండిపోయేది. సాయంత్రానికి జగన్నాథం రమణనుకూడా వెంట పెట్టుకుని యింటికి వెళ్ళేవాడు. మరునాడు పిల్లలిద్దరూ ఇంటికి వచ్చేవారు.

మధ్యాహ్నం జగన్నాథంతో వాళ్ళయింటికి వెళ్ళిన పద్మకు మిషను కుడుతుండగా నీరసంవల్ల శోషవచ్చింది. పని సాగక మిషనుబోర్డుమీదనే చేతిమీద తలఆన్చి విశ్రమించింది. వంటయింటిలోంచి అప్పుడే హాలులోకి వచ్చిన కామేశ్వరిని యీ దృశ్యం చకితపరిచింది. ఆతృతతో పద్మను సమీపించి చంపలమీద చేయివేసి చూసింది. వంట్లో బాగా జ్వరం వున్నది. కామేశ్వరి మృదువుగా తలనిమురుతూ పిలిచింది "పద్మా"

పద్మ తలఎత్తి కళ్ళు తెరచి చూసింది. ఒంట్లో చాలా బలహీనంగావున్నది. తల దిమ్ముగా వున్నది. కళ్ళు మూసుకుపోతున్నాయి. మాతృత్వం పొంగి పొరలుతున్న కామేశ్వరిని చూసి, పద్మలో మధురస్మృతులు కట్టలుతెగి ప్రవహించాయి.

" అమ్మా " బిగ్గరగా అరచింది, ఎదురుగా నిలుచుని వాత్సల్యాన్ని కురిపిస్తున్న కామేశ్వరి చేతులు పట్టుకుని. కామేశ్వరిలో ఏదో చైతన్యం కలిగింది. మధురమైనఆవేశం విద్యుత్తులా గగుర్పాటుకలిగించింది. 'అమ్మా!' ఎంత మధురమైన అనుభూతి. కామేశ్వరి పద్మను హృదయానికి హత్తుకుని ఒక క్షణం కళ్ళుమూసుకుంది. మధురమైన మనస్సులో, హృదయములో ఎంత మహత్తు వున్నది!

కామేశ్వరి పద్మను లేవదీసి లాలనగా ' రామ్మా ! లోపల పడుకుందువుగాని ' అన్నది. పద్మ తనవల్లు తనకు తెలియనిస్థితిలో వున్నది. కాని కామేశ్వరిమీద తన కెంతో గౌరవం, అభిమానం. ఏమాత్రం ఏదైనా ఆమెకు సహాయపడాలనే తను కోరుకునేదిగాని తనకోసం కామేశ్వరి శ్రమపడడాన్ని పద్మ సహించేదిగాదు. కాని కామేశ్వరిదీ అదే ప్రవృత్తి. పద్మకు సహాయంచేస్తూ, పద్మను తను అలంకరిస్తూ ఎంతో ఆనందాన్నిపొందేది. ప్రేమకూ, వాత్సల్యానికీ హద్దులే లేవని ఆమె అనుభవంలో తెలుసుకున్నది.

పద్మ కామేశ్వరివంక చూసి, నీరసంగా నవ్వింది. ' నాకేమ్మా! బాగానే వున్నానుగా '

కామేశ్వరి నవ్వుతూనే చిరుకోపాన్ని ప్రదర్శించింది. " బాగానేవున్నావు. నీకేం తల్లీ, అందాలరాశివి. ఇప్పుడు వల్లమాలిన జ్వరం వచ్చిపడింది. ఇంకా అలసిపోకుండావుంటే అది అదుపులోకి వస్తుంది "

పద్మ బదులు చెప్పలేదు. కామేశ్వరి పద్మను తీసుకు వెళ్ళి గదిలో కుర్చీమంచంమీద పడుకోబెట్టి పనిమనిషికి చెప్పి, ప్రక్కనున్న ప్లీడరుగారియింటినుంచి డాక్టరుకు ఫోను చేయించింది.

క్రమంగా పద్మకు జ్వరం పెరిగిపోయింది. సాయంత్రం నాలుగుగంటలప్రాంతానికి పలవరించటం ప్రారంభించింది. టెలిఫోనుచేసినప్పుడు డాక్టరు యింటిదగ్గర లేకపోవడంవల్ల సాయంత్రం ఐదుగంటలకు మాత్రం వచ్చాడు. పద్మను పరీక్షచేసి, ఒకపొట్లం పొడి యిచ్చి వేడినీళ్ళలో కలిపి తాగించ మన్నాడు. కామేశ్వరిని భయం వెన్నంటివున్నది.

" జబ్బేమిటి డాక్టర్ " అన్నది ఆదుర్దాగా.

కామేశ్వరి ఎంత భారంగా అడిగిందో, డాక్టరు అంత తేలిగ్గా సమాధానం చెప్పాడు. ' గాభరాపడవలసినపనేం లేదమ్మా. పాపం! నిన్నంతా భోజనం చేసినట్లులేదు. బాగా వేడిచేసి, నీరసంవల్ల శోషవచ్చింది. నీళ్ళలో మందు వేసి తాగించండి. ఇంకో రెండుగంటలకల్లా మామూలుమనిషవుతుంది. రాత్రికి మజ్జిగ ఎక్కువవేసి అన్నం పెట్టండి.'

డాక్టరు వెళ్ళిపోయాక కామేశ్వరి కొద్దిక్షణాలు ఆలోచనలో మునిగిపోయింది. పద్మ ఒకరోజంతా భోజనం చేయలేదట. ఇంట్లో బియ్యం లేవేమో! సహాయంచేయాలని తానెంత తాపత్రయపడినా, వాళ్లు సకాలానికి అందుకోవడం లేదు. వయసుకు పిల్లలేకాని, ఎంత అభిమానం! పద్మ పస్తయినా వున్నదికాని మాటమాత్రం అనలేదు. తిండిలేకుండా రమణ ఎలా పనికి వెళ్ళాడో! కామేశ్వరి మనసు

చివుక్కుమన్నది, తనకు ఎంతవుండికూడా సహాయపడవలసిన వాళ్ళకు సహాయపడలేకపోయామే అని.

వొంట్లో వేడి తగ్గిపోయి పద్మ ఎప్పుడు లేచికూర్చుంటుందాఅని కామేశ్వరి కాచుకుని కూర్చున్నది. బాగా పొద్దుపోయినతర్వాత పద్మకు మెలకువవచ్చింది. కామేశ్వరి విచారించి, పద్మకు నీరసం తగ్గిందని, కొంచెం ఉత్సాహం వచ్చిందని తెలుసుకుంది. పద్మకు వేడిఅన్నం వడ్డించి దగ్గర కూర్చుని ముద్దలుచేసిపెట్టింది. పద్మకు ఈరోజు జరిగిన సంఘటనలన్నీ గుర్తుకువచ్చి సిగ్గుతెర వచ్చింది. కామేశ్వరిని వారించి " నేనే తింటానమ్మా. నీకెందు కా శ్రమ. చిన్నాయన వచ్చేవేళయిందిగాచూడు; " అన్నది పద్మ. కామేశ్వరి సన్నగా నవ్వి, తెలివిగా సమాధానం చెప్పింది. " నీవంటి వాళ్ళను వృద్ధిలోకి తేవటానికి నేను పడేశ్రమలోనే ఆనందముందమ్మా! " అని ఆప్యాయతతో మెరుస్తున్న పద్మకళ్లలోకి చూసి, "చూడమ్మా, నీలో కష్టాలను భరించడానికి తగినఓర్పు వున్నదిగాని, వయస్సు లేదమ్మా! " అన్నది.

పద్మ ఛట్టున సమాధానంచెప్పలేదు. ఏదో ముఖ్యమైనవిషయం చెప్పబోయేముందు కామేశ్వరి ఇలామాట్లాడుతోందని పద్మ అర్థంచేసుకున్నది. పద్మ మౌనముద్రచూచి కామేశ్వరి మళ్ళీ అందుకుంది.

" నువ్వింత చిన్నవయస్సులో మనోవ్యథకు గురికావటం నా కిష్టంలేదమ్మా! నన్ను నీ మనిషిగా, మనసులో మనసుగా అర్థంచేసుకుంటే నువ్విక యీ యిల్లుకదిలి వెళ్లడం నేను సహించలేను.

పద్మ ఎంగిలిచెయ్యి కడుక్కొని నెమ్మదిగా వెళ్లి కామేశ్వరి మెడచుట్టూ చేతులుచుట్టి ఆప్యాయంగా ఆడుము కున్నది. "మామీద మీకు ఎందుకమ్మా అంత పిచ్చి ప్రేమ. నీకూ, చిన్నాయనకూ ఎంత కోపం తెప్పించేసని మేము చేస్తున్నామో మీ కంత అభిమానం పెరుగుతోంది. నాకు అంతకన్నా కావలసిందేమిటమ్మా! రమణఅన్నయ్యను అడుగుతాను."

కామేశ్వరికి ఆవేశం ముంచుకొచ్చింది. పద్మనుపొదివి పట్టుకుని హత్తుకున్నది. మెల్లిగా తీసుకువెళ్ళి పడుకోబెట్టి రేడియో తిప్పింది.

గ్రంథాలయకమిటీ మీటింగుసని పూర్తిచేసుకొని జగన్నాధం ఇల్లుచేరుకునేప్పటికి రాత్రి 10 గంటలయింది. కామేశ్వరి హాల్లోకూర్చుని, చెకోవ్ కథలు చదువుతున్నది. పద్మ మైమరచి నిద్రపోతున్నది. జగన్నాధం పద్మనుచూచి స్నానానికి నీళ్ళుతోడి వచ్చిన కామేశ్వరివంక తిరిగి "పద్మ త్వరగానే పడుకున్నది. అలసిపోయి పడుకున్నదా, అలిగి పడు కున్నదా ?" అని అడిగాడు.

కామేశ్వరి ఛలోక్తిగా చెప్పింది. "ఏదీలేదు. చిన్నా యనయింట్లోనే వుండటానికి అంగీకరించి పడుకున్నది."

జగన్నాధం తృప్తిగా నవ్వుకున్నాడు. కామేశ్వరి చెప్పిన వివరాలు విని, ఆనాటిసంఘటనకు, ఆ పిల్లలస్థితికి జాలిపడ్డాడు. భోజనంచేస్తూ జగన్నాధం అడిగాడు.

"రమణ ఇవ్వాళ కనుపించనేలేదు. నేను పనితొందరలో వున్నాను. పాపం! పద్మ తిరిగిరాలేదని వెతుక్కుంటూ యిక్కడికి వచ్చివుంటాడు. భోంచేసి వెళ్ళాడా?"

కామేశ్వరి చకితురాలైంది. "రమణ రానేలేదు. మీతోకలిసి వస్తాడేమోనని కాచుకొనివున్నాను. మీతో రాకపోతే, మీకుచెప్పి సినిమాకేమైనా వెళ్ళాడేమో ననుకున్నాను."

జగన్నాథానికి యీ పరిస్థితి కొంచెం క్లిష్టంగానే తోచింది. పద్మ యింటికి వెళ్ళకపోతే, రమణ నేరుగా తమయింటికి వచ్చేవాడు. లేదా తనను గ్రంథాలయంలో కలుసుకుని వెంటవచ్చేవాడు. బయటి కెక్కడికైనా వెళ్ళి ఆలస్యమయ్యే పక్షంలో తనకు చెప్పి వెళ్ళేవాడు. మరి యివ్వాళ పదకొండు గంటలైనా యింటికి రాలేదు.

జగన్నాథం ఆలోచనల్లో మునిగిపోవటం చూసి, కామేశ్వరి సలహాచెప్పింది. "పాపం పసివాడు. కొట్లో శ్రమపడివచ్చి, ఇంట్లో వళ్ళుమరచి నిద్రపోయాడో, లేక ఇంటికి కూడా చేరలేదో! కొంచెం అలా వెళ్ళిరండి" జగన్నాథం కామేశ్వరి ముఖంలోకి చూశాడు. లాలనగా, ప్రాధేయతగా ఆమె తనవంక చూస్తున్నది. జగన్నాథం ఇహ ఆలస్యం చేయలేకపోయాడు. లోపలకు వెళ్ళి దుస్తులుమార్చుకుని వచ్చి "నేను వెళ్ళొస్తాను. తలుపు దగ్గరగావేసి నీవు పడుకో కామూ" అంటూనే రమణకోసం ఆత్రంగా వెళ్ళిపోయాడు.

# 6

తననుగురించి శేషావతారం అతనిఅభిప్రాయాలను మార్చుకున్నాడని తెలుసుకున్నతర్వాత రమణతనకున్నఆలోచనతో బహు జాగ్రత్తగా ప్రవర్తిస్తున్నాడు. యజమాని ఆగ్రహాన్ని, నోటిదురుసుమాటలను భరించడం, మిగతా గుమాస్తాలు యజమానిఅభిమానంకోసం తనమీద నూరే కారాలు మిరియాలూ, ప్రదర్శించే అసహ్యప్రవర్తనను ఓర్పుతో ఎదుర్కోవడం అలవరచుకున్నాడు.

భరించలేనివాళ్ళకు బరువుగా, అవలీలగా జీవితాన్ని తోసేవాళ్ళకు తేలికగా కనుపించేకాలం ఏదో అతీతమైన శక్తికి లోబడి జీవితాల్లో విపరీతపరిణామాలను తెస్తుందని రమణ చిన్నిమెదడుకు తోచలేదు.

ఊపిరసలడానికూడా వీల్లేనంత పనివల్ల పొద్దున 6 గంటలకు కొట్టుకువచ్చిన రమణకు ఒంటిగంటకుగాని భోజనానికి వెళ్ళడానికి వీలుకాలేదు. టవరుక్లాక్ ఒంటిగంట కొడుతుండగా శేషావతారానికి చెప్పి రమణ భోజనానికి బయలుదేరాడు. కొట్టునుంచి అరఫర్లాంగుదూరం వెళ్లాడో లేదో, శేషావతారంకొట్లోగుమాస్తా రొప్పుకుంటూ, రోజుకుంటూ పరుగెత్తివచ్చి రమణను నిలవేసి ఆత్రంగానే, "అయ్యా రమ్మంటున్నారు". అన్నాడు. రమణ ప్రశ్నార్థకంగా నిలుచుండిపోయాడు. పొద్దుననగా కొట్టుకువచ్చి అంత పొద్దుపోయి అన్నానికి వెడుతుంటే, మళ్ళీ త్రోవలోనే యీ కబురేమిటి? రమణకు వాస్తవానికి కొంచెం చిరాకు వేసింది; కోపంవచ్చింది. ఇంటికెళ్ళే ధోరణిలోనే గుమాస్తా

వంక తిరిగి "ఇదుగో, త్వరగా భోంచేసి అరగంటలో వస్తా నని అయ్యకు చెప్పు." అన్నాడు. వచ్చిన గుమాస్తాను యింకా ఆయాసంతీరలేదు. కొంచెంతడబడుతూనే అన్నాడు. "అట్లాకాదు, నిలుచున్నపళంగా నిన్ను పిలుచుకురమ్మ న్నారు. పద, పద" రమణ మారుమాట్లాడకుండా ఆకలి కడుపుతోనే కొట్టువంక వెళ్లాడు.

రమణ తిరిగివచ్చేప్పటికి శేషావతారం నిప్పులు తొక్కినవాడిలా చిందులువేస్తున్నాడు. రమణ కళ్లఎదుటకు రాగానే విరుచుకుపడ్డాడు, "ఎక్కడా ఆ రెండొందలు. దొంగ వెధవ! ఇట్లా గడ్డితినకపోతే పిచ్చుల్లోఅడుక్కుతినరాదు. ఎక్కడ పెట్టావ్?" అంటూనే రమణజేబులు తడివిచూశాడు. రమణనిర్విణ్ణుడైపోయాడు. పలకాలేదు, ఉలకాలేదు. రెండొందల లేమిటో, తను కాజేయడం ఏమిటో అంతా అగమ్యగోచ రంగా వుంది. శేషావతారం హెచ్చుస్థాయిలో కేకలేస్తు న్నాడు. బేరానికివచ్చినవాళ్ళకు సరుకులివ్వకుండా రమణ వంక చూపుడువేలుంచి, చెప్పుకుపోయాడు. "పావుగంటక్రితం యీవెధవవుండగా వెంకటరావుప్లీడరు ఖాతాక్రింద జమకట్టు కోమని రెండు నూరురూపాయలనోట్లు యిచ్చారు. టిఫిన్ డబ్బాలకోసం నేను లోపలకు వెళ్ళిరాగానే, వీడు భోజనాని కని వెళ్ళాడు. తర్వాత గల్లాతెరచి చూస్తే, రెండు నోట్లూ మాయమయ్యాయి. ఈ దొంగవెధవ హస్తలాఘవం కాక పోతే, వాటికి కాళ్ళేలావస్తాయి? ఇంకొకర్ని అనుమానించ డానికి వాడువెళ్ళేవరకు మరొక గుమాస్తాకూడా లేదు.

రమణకు విషయం ఇప్పుడు కొంచెం బోధపడింది. కాని తనేపాపం ఎరుగడు. తన నిర్దోషిత్వం ఎలా రుజువుచేసుకోవాలి? శేషావతారం వాడిని ఎముకలువిరగకొడతానని, పోలీసులకు పట్టిస్తానని బెదిరించాడు. రమణ కుప్పలా కూలిపోయి వలవలా ఏడ్చాడు. మరో పదినిముషాలకు పరిక్కనున్న గుడ్డలకొట్టుగుమాస్తా వచ్చి, శేషావతారంచేతులో రెండు నూరురూపాయల నోట్లుంచి, "మా శెట్టిగారు మీ దగ్గర యింతకుముందు చేబదులు తీసుకున్నారటగా, అనామతులో వ్రాసివుంటే కొట్టివెయ్యండి" అని చెప్పి వెళ్లిపోయాడు. శేషావతారం నోట్లు అందుకుంటూనే, జరిగినవిషయమంతా గుర్తుతెచ్చుకొని, గుమాస్తాలవంక తప్పు చేసినవాడిలా చూస్తూ, రమణవంక చూడలేక సిగ్గుతో కాలిపోయాడు. రమణ తలఎత్తి చూశాడు. కళ్ళు తుడుచుకున్నాడు. లేచి నిలుచుని శేషావతారంవంక ఒక్కమారు రుసరుసా చూసి, చకచకా మెయిన్‌రోడ్డువంక వెళ్ళిపోయాడు.

రమణమనస్సు బరువెక్కిపోయింది. శరీరంలోని ప్రతిజీవాణువు సందిగ్ధంలోపడి కొట్టుకులాడుతున్నది. తనిక శేషావతారం కొట్టుకు వెళ్ళకూడదు. ఈస్థితిలో జగన్నాథం యింటికి వెళ్ళడానికికూడా మనస్కరించలేదు.

అన్నీ సమస్యలే. అంతా అగ్నిపరీక్ష. రాజారావు మాదిరి రమణకూడా గంటలతరబడి ఆలోచించడం, ప్రమాదాన్నికూడా ప్రమోదంతో స్వీకరించడం అలవాటవుతున్నది. ఆలోచిస్తూనే రమణ అలా నడిచి వెళ్లిపోయాడు. కొరిటపాడురోడ్డున చాలాదూరం వెళ్ళి ఒక పాడుపడ్డ యింటి

వద్ద చతికిలబడ్డాడు. అతని ఆలోచనల్లో, ప్రమత్తతలో తన పరిసరాలుగాని ఎదురుగుండా రోడ్డుమీద శబ్దాలు, చలనం అతనిదృష్టిని ఆకర్షించలేదు. రోడ్డుమీద రద్దీ తగ్గిపోయింది. కొంచెం వెన్నెలవచ్చాక వీధిదీపాలు ఆరిపోయాయి. చలి ప్రవేశించి వీధులు నిర్మానుష్యం చేసింది. రమణ ముడుచుకుని వొదిగి కూర్చున్నాడు, ఏమీ జరగనట్లే ఆలోచిస్తూ వున్నాడు. బాధలోవున్న అతనిజోలికి రావడం యిష్టంలేనట్లు నిద్రాదేవికూడా కరుణించి వదిలింది.

కోళ్ళుకూస్తుండగా రమణ తేరుకుని జగన్నాథం యింటిముఖంగా వెళ్ళాడు.

అప్పుడే తెల్లవారుతున్నది. వీధితలుపులు తెరచి, పనిమనిషి పనిచేసుకుంటున్నది. వీధిగుమ్మం ఎక్కుతుండగానే రమణకు పాలకోసం హాల్లోనుంచివస్తున్న కామేశ్వరి కనుపించింది. వరండాలోకివచ్చి కామేశ్వరి ఎవరామనిచుని లైటు వేసింది. రమణ వీధితలుపుదగ్గరే తలవంచుకుని నిలుచుచున్నాడు. కామేశ్వరికి ఆశ్చర్యం కలిగింది. మేజామీద గిన్నెవుంచి రమణదగ్గరగా వెళ్ళింది. "ఎవరో అనుకున్నాను, నువ్వా బాబూ! రా లోపలకు రా. నీయింట్లోకి రావడానికి నీకు సంకోచమెందుకు ?" అన్నది.

రమణకు నోరుపెగల్లేదు. కామేశ్వరే రమణను లోపలికితీసుకవెళ్లింది. కాళ్లూ చేతులూకడిగించి, తనగదిలోకితీసుక వెళ్ళింది.రమణకు తలంతా రేగిపోయివుంది. కళ్ళు జ్యోతుల్లా ఎర్రబడ్డాయి. తృటిలో విషయాన్ని అర్థంచేసుకున్న కామేశ్వరి పక్కసర్ది రమణను విశ్రమింపజేసింది. తను ప్రక్కనే

కూర్చున్నది. రమణకు కామేశ్వరిస్పర్శతో ఆ మెత్తనిపాన్పు మీాద పడుకోగానే కళ్ళు మూతలుపడ్డాయి.

అర్ధరాత్రివరకూ వెతికి వేసారి వచ్చి పడుకున్న జగన్నాథం కొంచెం ఆలస్యంగా నిద్రలేచి విషయం తెలుసుకొని తనలోతాను నవ్వుకున్నాడు. వేడి తేనీరు త్రాగి రమణ విషయంలో కామేశ్వరికి కొన్నిసూచనలిచ్చి లైబ్రరీకి వెళ్ళిపోయాడు.

శేషావతారంకొట్లో రమణ నిర్దోషిగాపరాభవంపొందినందుకు జగన్నాథం, కామేశ్వరి చాలా నొచ్చుకున్నారు. రమణను ఏదోవిధంగా తనకాళ్లమీాదతాను నిలుచునేమార్గం చూడాలని జగన్నాథం చాలా తీవ్రంగా ఆలోచించాడు.తన స్నేహితులను సంప్రదించిచూశాడు. రమణవిషయంలో కామేశ్వరికూడాచిన్నసలహాయిచ్చింది. జగన్నాథంఅన్నిటినీ, మనసులోపెట్టుకొని శ్రద్ధగా పరిశీలించి ఒకనిర్ణయానికి రాగలిగాడు.

సోమవారం గ్రంథాలయానికి శలవురోజు కావటంవల్ల జగన్నాథం యింటిదగ్గరే వుండిపోయాడు.

భోజనాలైనతర్వాత జగన్నాథం రమణను తనగదికి తీసుకువెళ్లాడు. రాజారావు విషయం కొంత మాట్లాడిన తర్వాత రమణను సూటిగా అడిగాడు, "నీ విషయమే నేను తీవ్రంగా ఆలోచిస్తున్నాను. నీకు ఏపని చేయడం యిష్టం?"

రమణ అన్నాడు, "ఆ శేషావతారంకొట్లో మట్టుకు పనిచెయ్యను బాబాయ్. మరెక్కడైనా గుమాస్తాపనికి ప్రయత్నిస్తాను."

జగన్నాథం చిరునవ్వునవ్వి అన్నాడు.

"గుమాస్తాపనిలో స్వేచ్ఛ, స్వతంత్రంగా ఆలోచించే అవకాశం, చేస్తున్నపనిని వృద్ధిచేసుకోవాల్సిన అవసరం ఏమున్నవిగనుక", రమణ కొంచెం సమయస్ఫూర్తిగానే బదులు చెప్పాడు. "స్వతంత్రంగా జీవించాలనేఆశ నాకూ వున్నది బాబాయ్! కాని—"

జగన్నాథం నవ్వుతూ రమణవీపు తట్టాడు, "నీబాధ, భావం నాకు అర్థమయింది రమణా. మీఅమ్మ సలహాతీసు కున్నాకనే నే నోనిర్ణయానికి వచ్చాను.. నీవు ఏ గుమాస్తా పనీ చెయ్యవద్దు. నేనొకఐదువందలు పెట్టుబడికి యిస్తాను. చిన్న గృహపరిశ్రమ పెట్టి వక్కపొడి, పళ్ళపొడి తయారుచేసి అమ్ము. ఇలాంటివాటిల్లో తరిఫీదుయివ్వటానికి మీఅమ్మ అందెవేసినచెయ్యి."

రమణ పరవశించిపోయాడు. మనస్సు తేలికపడి అతని లో ఆనందం విరియబూసింది. లేచి నమస్కారంచేసి జగన్నాథంచేతులుపట్టుకుని అన్నాడు—"బాబాయ్, భగవం తుడే నీరూపంలో నాకు కనుపిస్తున్నాడు. ఔను బాబాయ్, అమ్మా, మీరు దయామయులు, ప్రేమమూర్తులు. ఈజన్మ లోనే మీఋణం, అమ్మఋణం తీర్చుకునే శక్తి నివ్వమని దేవుణ్ని రోజూ కోరుకుంటాను." రమణ కృతజ్ఞతతో మైమరచిపోయాడు. సంతోషంతో కన్నీళ్ళు వదిలాడు- జగన్నాథం తనలో తను నవ్వుకున్నాడు- తమసంతోషంలో పాలుపంచుకోడానికి కామేశ్వరి, పద్మలకోసం బిగ్గరగా కేక వేశాడు జగన్నాథం.

# 7

రమణయ్యమాటప్రకారం రాజారావుకు హోల్ సేల్ పండ్లకొట్టులో గుమాస్తావుద్యోగం కుదిరింది.

రాజారావును రమణయ్య వెంటపెట్టుకుని వెళ్లి, పండ్ల కొట్టుయజమాని శివకామయ్యకు పరిచయంచేశాడు. శివకామయ్య రాజారావుకు వుద్యోగంలో నిర్వహించవలసిన విధులు, బాధ్యతలు ఏకరువుపెట్టాడు. రాజారావు ఆ షరతులకుగాని, నూటయాభై రూపాయల స్వల్పజీతమునిగాని బెదిరిపోలేదు. తనకు జీవితంలో అనుభవం, అనుభూతులు కావాలి. అన్నిటికీ అంగీకరించి మరునాడే వెళ్ళి వుద్యోగంలో చేరాడు.

ఉదయం ఏడున్నరకల్లా కొట్టుకు వెళ్ళి లారీలలో దిగిన సరుకు లెఖ్ఖచూసుకొని, గోడవునులో సర్దించుకోవాలి. ఎనిమిదిగంటలనుంచీ రిటెయిలువర్తకుల వ్యాపారం ప్రారంభమై ఆ రద్దీ పన్నెండుగంటలుదాటేవరకూ వుంటుంది. ఒంటిగంటకు కొంచెం వెనుకాముందుగా యింటికి వెళ్ళి రెండుమెతుకులు నోట్లోవేసుకొని, రెండున్నరకల్లా కొట్టుకు రావాలి. మధ్యాహ్నంనుంచి అప్పులు, సప్పులు లెఖ్ఖల గొడవ. ఏరోజూ లెఖ్ఖలుకట్టి మిగిలిపోయినపండ్లు ఏదో విధంగా వొదిలించుకుని, కొట్టుమూసేప్పటికి ఎనిమిదిగంటలౌతుంది. రాజారావు యింటికిచేరేసమయానికి రమణయ్య వీధిగుమ్మంలో తూలుతూ కాచుకుని కూచునేవాడు.

రమణయ్య కిప్పుడు రాజారావు ఆత్మీయుడు. రాజారావుకు రమణయ్య కన్నతండ్రిలాంటివాడు. వాళ్ళిద్దరిలో యిప్పు డేదో బలియమైన ఆంతరంగికసంబంధ మేర్పడింది.

దశాబ్దాలనుంచి వున్న బంధుత్వంలా, స్నేహితులమాదిరి ఒకరి కోసరం మరొకరు తహతహలాడేవాళ్ళు. రాత్రిఎంతపొద్దైనా, భోంచేయకుండా అతను రాజారావుకోసం ఎదురుచూస్తూ కూచునేవాడు.

ఆలస్యంగా వచ్చినప్పుడు గుమ్మంలోకూచుని నిద్ర నాపుకోవడానికి ప్రయత్నిస్తూ తూలుతూ కూనునే రమణయ్యనుచూసి రాజారావుకు నవ్వొచ్చేది, జాలికలిగేది, అంతర్గతంగా బాధపడడం తప్పనిసరిఅయ్యేది.

రాజారావు వెళ్ళి రమణయ్యచెవిదగ్గరగా నోరుపెట్టి తమాషాగా "బాబయ్యా" అని పిలిచేవాడు. రమణయ్య కొంచెం తొట్రుపడి లేచేవాడు, "రా - బాబూ! నీకోసమే ఎదురుచూస్తున్నాను. నీవు దగ్గరగావచ్చి పిలుస్తే, స్వర్గం నుంచి పిలుపువచ్చినంత హాయిగా మెళుకువవచ్చింది. పద పద, చాలా పొద్దుపోయింది." రమణయ్య కబుర్లుమొదలు పెడితే మాటలపుట్ట. రాజారావును కవ్వించి, నవ్వించి భోజనంచేయించేవాడు. రాజారావు వూ - కొట్టినంతవరకూ తన అనుభవాలు చెబుతూ నిద్రబుచ్చేవాడు.

రాజారావుకు పండ్లకొట్లో దినదినానికి బాధ్యతలు పెరుగుతున్నా రమణయ్య కలిగించే మనోవికాసంవల్ల ఎంత శరీరకష్టాన్నైనాఅవలీలగా చేయగలుగుతున్నాడు. వుద్యోగంలోని ఒడుదుడుకులను ఓర్చుకోగలుగుతున్నాడు.

రాజారావు పనిచేస్తున్న పండ్లకొట్లో షష్టిపూర్తిచేసుకొన్న ఒక క్యాషియరు వున్నాడు. ఇద్దరు పనివాళ్లున్నారు.

క్యాషియరుకు ఆ పండ్లకొట్లో పందొమ్మిది సంవత్సరాల సర్వీసువుంది. పదిహేను రూపాయలకు చేరి యిప్పుడు తొంభై అయిదు రూపాయలు తీస్తున్నాడు. మనిషి చాలా సంకుచితస్వభావంకలవాడు. లోభి. యీర్ష్యాపరుడు. అవతలి మనిషి అభిప్రాయాలను, ఆలోచనలను లెక్కచేసేవాడు కాదు. అతని దృష్టిలో తనొక గవర్నరుగిరి చలాయిస్తున్నాడు. తన కింద పనిచేస్తున్న రాజారావు, యిద్దరు పనివాళ్ళు యంత్రాలు. ప్రతిక్షణం ప్రతిపనిలో ప్రతిఅవకాశంలో తనగొప్పతనం అనుభవం ధీమా ప్రదర్శించడానికి ప్రయత్నించేవాడు. రాజారావుకూడ కోపమువచ్చి తొణకలేదు. ఎదురుచెబితే వుద్యోగంపోతుందన్న భయంతో వణకలేదు. క్యాషియరు రాజారావును కొత్తలో 'ఏమండీ' అన్నాడు; కొంచెం పాతపడ్డాక 'ఏమయ్యా' అన్నాడు; క్రమంగా ఏమోయ్ అని పిలవడం అలవరచుకున్నాడు. రాజారావు దేనికీ బాధపడలేదు. హృదయం మనస్సు లేని రాతివంటి మనుషులు చేసే పనులకు చూపే ప్రవర్తనకు బాధపడటం అనవసరంగా అవతలి వ్యక్తికి లేనిపోని గౌరవాన్నివ్వడమేనని రాజారావు అర్థంచేసుకున్నాడు.

శివకామయ్య పోకేలామనిషి. మధ్యాన్నం ఒకమారు వచ్చి వుత్తరాలు చూసుకొని, సమాధానాలు వ్రాయవలసిన వాటికి సూచనలిచ్చి వెళ్లేవాడు. సాయంత్రం వస్తే డబ్బులెక్క చూసుకొని వెళ్లేవాడు. రాకపోతే క్యాషియరు లెక్కపెట్టి శివకామయ్యయింటిదగ్గర డబ్బువప్పగించి వెళ్లేవాడు.

రాజారావు వీలైనంత ఎక్కువ శ్రమకు ఓర్చుకోవడం నేర్చుకొన్నాడు. పండ్లకొట్టు క్యాషియరువంటి చిత్రమైన మనిషిని అర్థంచేసుకొని అతనిననుసరించి తను సర్దుబాటు చేసుకోవటం అలవరచుకున్నాడు, కాని ప్రయోజనం కనుపించలేదు. ముసలి క్యాషియరు వున్నట్లుండి అకారణంగా అనవసరంగా రాజారావుమీద రెచ్చిపోయేవాడు. ఇంగ్లీషు చదివిన వాళ్ళమీద, కానీ ఆస్తి లేకుండా ఇస్త్రీగుడ్డలు వేసుకొని తిరిగే యువకులమీద పెట్టి చెడామడా తిట్టేవాడు. శివరామయ్య కొట్టుకువస్తే, క్యాషియరు రాజారావు వంక కొరకొరా చూస్తూ యజమానిని లోపలకు తీసుకువెళ్ళి గుసగుసలాడి వచ్చేవాడు, ఆ పండ్లకొట్టురాజ్యంలో రోజూ దేవరహస్యాలున్నట్టు.

ఆనాడు రాజారావు మామూలువేళకే వుదయం కొట్టుకు వెళ్లాడు. లారీలలోవచ్చిన పండ్లు గోడవునులో దింపించుకున్నాడు. క్యాషియరు ఒళ్ళు బాగాలేదనీ, కొట్టుకు రావనీ కబురుచేశాడు. రాజారావు బాధ్యత, పని రెట్టింపయింది.

ఎనిమిదిగంటలకు ప్రారంభమయిన రిటెయిలు వ్యాపారులబేరం ఒంటిగంటదాకా సాగింది. ఆరోజు దిగిన పండ్లలో రెండులారీలు శీతాఫలాలు దిగాయి. లారీల రిపేర్లవల్ల దారిలో ఆలస్యమై మద్రాసుచేరేప్పటికి శీతాఫలాలు బాగా పండిపోయాయి. యుక్తియుక్తంగా ఆలోచించి పన్నెండు గంటలకల్లా ఆ సరుకులో మూడొంతులు అమ్మగలిగాడు రాజారావు. మామూలుగా సాయంత్రం మూడుగంటలవరకు

రిటెయిలువ్యాపారులు వస్తూనేవుంటారు. ఆరోజు పన్నెండు దాటినతర్వాత ఒక్కడూ రాలేదు. రెండుగంటలనుంచి మూడుగంటలలోపల, పండ్లు అప్పుగాయిచ్చేవాళ్ళకోసం వెతికి అప్పుతీసుకున్నాక ఆరునెలలకైనా ముఖంచూపించనటువంటి ఐదారుగురు రిటెయిలు వ్యాపారస్థులు వచ్చారు. కొద్దిరోజుల అనుభవంలోనే రాజారావు వాళ్ళ స్వభావాలు అర్థంచేసుకున్నాడు. వాళ్ళు వచ్చీరావడంతోనే చల్లగా సర్ది చెప్పి అప్పుయివ్వకుండా సాగనంపాడు.

నాలుగుగంటలు దాటినప్పటినుంచి రాజారావుకు మిగిలిపోయిన శీతాఫలాలవిషయం సమస్యఐపోయింది. ఆ పండ్లను వదిలించుకోవాలని ఎన్నో ప్రయత్నాలుచేశాడు; ప్లానులు వేశాడు. పనివాళ్ళను తిరిమి పండ్లవ్యాపారస్తులను పట్టుకొస్తే మంచి బహుమతి యిస్తానని ఆశపెట్టాడు. ఒక్కటీ సాగలేదు. దీర్ఘమైన ఆలోచనలో, ఎడతెరిపిలేని ప్రయత్నాలలో కాలం పరుగుతీసింది. రాత్రి ఎనిమిదిగంటలయ్యాక యిహ ప్రయోజనంలేదనుకున్నాడు తను. కొట్టుమూసి క్యాషియరుకో, శివకామయ్యకో విషయం ఎరుకపరుస్తామని బయలుదేరాడు.

వొంట్లోబాగాలేదని కబురుచేసిన క్యాషియరు ఇంట్లో దొరకలేదు. శివకామయ్యయింటికివెళ్ళి విచారిస్తే, అతను క్రిందటిరోజు బెంగుళూరు రేసులకు వెళ్ళాడనీ, మరునాడు ఉదయమే వస్తాడనీ తెలిసింది. రాజారావు ఆ ఆలోచనను అంతవరకే తెంచుకుని, మొండిధైర్యంతో యింటిముఖం పట్టాడు.

మరునాడు ఉదయం రాజారావు కొట్టు తెరిచిచూస్తే మిగిలిపోయిన శీతాఫలాలు కుళ్ళి వాసనకొడుతున్నాయి. దానికితోడు రాత్రింతా ఎలుకలు విచ్చలవిడిగా విహారం చేశాయి. ఈ సంఘటనకు రాజారావు దిగ్భ్రమచెందాడు. మనస్సాక్షిగాచేసిన ప్రయత్నం ఫలించక జరిగే పరిణామానికి బాధపడ్డాడు.

ఎనిమిదిగంటలకు క్యాషియరు కండువాతో ముక్కు-మూసుకుని ' అబ్బబ్బ! ఏమిటోయ్ ఈ కంపు? ' అంటూనే లోపలకు అడుగుపెట్టాడు.

రాజారావు గోడవునులో రాసులుగా కుళ్ళి పడివున్న శీతాఫలాలవంక చూస్తూ, " మిగిలిపోయినపండ్లన్నీ మురిగి పోయాయండి " అన్నాడు అతిదీనంగా.

క్యాషియరు వెకిలిగా నవ్వాడు.

" ఆ ... హాఁ ... లారీలోడుపండ్లు నాశనమే. నువ్వు చెబుతూంటేనే నా గుండెలు కరిగిపోతున్నాయి. కామయ్య గారికి తెలుస్తే మనబ్రతుకు యింకేమైనావుందా?" తనేదో గొప్ప అపరాధంచేసినవాడిలా భయం ప్రదర్శించాడు. రాజారావు క్యాషియరు వూహించినట్లు భయంతో వణికి పోయాడు. దీర్ఘమైన ఆలోచనాధీనుడై, స్తబ్ధుడై నిలుచుండి పోయాడు.

క్యాషియరు మాటల్లోనే బయటకు జారుకున్నాడు. పావుగంటలో యజమానిని వెంటబెట్టుకుని వచ్చాడు. శివకామయ్య గుర్రపుపందాలలో ఓడిపోయాడేమో- ముఖం కందగడ్డలాపెట్టుకుని నిప్పులుకక్కుతూ వచ్చాడు.

"ఏడీ ఆ దద్దమ్మ," రాజారావుకు దగ్గరగావచ్చి అందుకున్నాడు. "ఏమోయ్! నీవు యింత అప్రయోజకుడ వనుకోలేదు. పండ్లవ్యాపారంలో ఓనమాలు నేర్చుకున్న వాడు కూడా యిటువంటి చవటపని చెయ్యడు."

రాజారావు మౌనంగావుండటం చూసి శివకామయ్య ఇంకా బిగ్గరగా అరవడం ప్రారంభించాడు. "నీకొచ్చే నాలుగునెలలజీతం చేర్చినా యీ నష్టం పూడదు. చూస్తూ చూస్తూ రెండొందలు దిబ్బలోపోసినట్లు... మూగ మొద్దులా మాట్లాడవేం"

శివకామయ్య కచ్చతీరినంతవరకు తిట్టి క్యాషియరుకు ఏదో ఉపదేశంచేసి వెళ్ళిపోయాడు. రాజారావు మానసికంగా చితికిపోయాడు. అతని అభిమానం బాగా దెబ్బతిన్నది.

మానవుడు దేనినైనా పోగొట్టుకోవచ్చు. పరువు, ప్రతిష్ట, మానాభిమానాలు కాపాడుకోవాలి. నైతికంగా, మానసికంగా వాటికున్న విలువ మరేధనరాసులకూ లేదు. రాజారావు ఆలోచిస్తూ ఆలోచిస్తూ క్షణంలో ఒకనిశ్చయానికి వచ్చాడు. రాజీనామాంవ్రాసి క్యాషియరుకు అందించి బయటకు నడిచాడు "వస్తాను" అంటూ.

వీధిగుమ్మందిగుతూ రాజారావు వెనుతిరిగి కొట్టులోపలకు చూచాడు. తన రాజీనామావంక ఒకమారు, తనవంక ఒకమారుచూసి ముసిముసినవ్వులు నవ్వుకుంటున్న షష్టిపూర్తి క్యాషియరు బాణందెబ్బతిన్న లేడిలా బెదరిపోయి ముఖం చిట్లించుకున్నాడు.

చిత్రమైన సమాజంతో ముష్టియుద్ధం చేయటానికి సంసిద్ధుడై మళ్లీ ముందడుగువేశాడు రాజారావు.

# 8

జగన్నాథం తనయింటిపక్క ప్లీడరుగారింట్లో ఒక వాటా బాడుగకు తీసుకుని ఇద్దరుపనివాళ్ళను కుదిర్చాడు. రమణచేత వక్కపొడి, పండ్లపొడి, తయారుచేయడానికి "పద్మా యిండస్ట్రీ" పేరుతో ఒక చిన్న కుటీరపరిశ్రమ పెట్టించాడు.

కుటీరపరిశ్రమ ప్రారంభించిన మొదటిరోజునుంచీ రమణ అహోరాత్రిలూ పనిచేస్తున్నాడు. పద్మ అతనికి ప్రతి చిన్నవిషయంలోనూ సాయపడుతున్నది. తీరికదొరికి నప్పుడల్లా జగన్నాథం స్వయంగావచ్చి చూసి సూచనలిచ్చే వాడు. మిగతా అన్నిఏర్పాట్లు కుటీరపరిశ్రమల్లో అనుభవం వున్న కామేశ్వరి పర్యవేక్షణక్రింద జరిగాయి.

రమణకు యిప్పుడు తనొక కొత్తప్రపంచంలోకి తొంగి చూసి అడుగులువేస్తున్నట్లు అనిపించింది. ఇంతకుముందు తనలో కలగని వుత్సాహం ఇప్పుడు వురకలువేస్తు న్నది. తనూ ఆలోచించగలనని, ఆలోచించి తననిర్ణయాలు ఆచరణలో పెట్టగలననే ఆత్మవిశ్వాసం కలిగింది. ఇప్పుడు తను శేషావతారంకొట్లో పొట్లాలుకట్టే పనివాడుకాదు. ఇప్పటి తన వునికి ఒక కుటీరపరిశ్రమలో కీలకస్థానం.

జగన్నాథానికి దూరాలోచన వున్నది. రమణచేత పెట్టించిన కుటీరపరిశ్రమ ఏర్పాట్లు పూర్తిఅయ్యాక కావా లని ఆ విషయంలో తను జోక్యంకలుగచేసుకోవటం తగ్గించు

తున్నాడు. రమణకు స్వతంత్రఆలోచన, కల్పనాశక్తి, నిశిత దృష్టి పెంపొందడానికే జగన్నాథం ఉదాసీనత వహించాడు. రమణ తనకై తాను అడిగినప్పుడుమాత్రం చక్కనిసలహాలిస్తున్నాడు.

మూడువారాలకాలం తిరిగీతిరగకముందే వక్కపొడి, పండ్లపొడి రకరకాల ఆకర్షణీయమైన ప్యాకింగులలో అమ్మకానికి తయారయినవి.

దారిలేనప్పుడే ముఖ్యంగా మానవుడు మానసికశక్తిని కేంద్రీకరించి. తీవ్రంగా ప్రయత్నించి దారి చేసుకుంటాడు. ఈమాట రమణవిషయంలో అక్షరాలా నిజమని ఋజువయినది రమణకు ఇప్పుడు తనశక్తిని పరీక్షించే బాధ్యతను తీసుకోవడం, బాధ్యతానిర్వహణకు లోతుగా ఆలోచించడం తప్పనిసరైంది.

పద్మాయిండస్ట్రీలో తయారైన వక్కపొడి. పళ్ళపొడి అమ్మకాన్నిగురించి రమణ కలవరపడలేదు. ఒకపథకం ఆలోచించి జగన్నాథం అంగీకారంపొంది ఆచరణలోపెట్టాడు.

ప్రతిపుదయాన పళ్ళపొడిపొట్లాలు తీసుకుని ఒక పెద్ద వీధికివెళ్లి యింటింటికీవెళ్ళి నచ్చచెప్పి పొట్లాలు అమ్మేవాడు. పదిగంటలనుంచీ పన్నెండుగంటలదాకా వీలైనన్ని యిళ్లు తిరిగి వక్కపొడి ప్యాకెట్లు అమ్మేవాడు. సాయంత్రం నాలుగు నుంచీ బాగా చీకటిపడేదాకా నాలుగురోడ్ల కూడలిలో నిలుచుని కేకలువేసి ఆకర్షణీయమైన మాటలుచెప్పి తనవెంట తెచ్చిన సరుకంతా అమ్ముకుని వెళ్ళిపోయేవాడు.

వున్నట్టుండి జగన్నాథం జబ్బుపడ్డాడు. వారంరోజులు జ్వరంతో బాధపడ్డాడు. తరువాత కొంచెం తగ్గువచ్చింది. ఇద్దరుడాక్టర్లను చూచాడు. మందులు, యింజక్షనులు తీసుకున్నాడు. ప్రయోజనం లేకపోయింది.

కామేశ్వరి పట్టుదలవల్ల జగన్నాథం పెద్దడాక్టరును చూశాడు. ఆయన పరీక్ష చేసి, ఎక్సరేతీసి చూసి క్షయ వ్యాధి వచ్చిందని, వెంటనే శానిటోరియంలో చేరటం, కనీసం మూడు నెలలైనా విశ్రాంతితీసుకోవటం అవసరమని చెప్పాడు. జగన్నాథం కృంగిపోలేదు. భయంతో బాధపడ లేదు. తనలో తాను నవ్వుకున్నాడు. భగవంతుడు ఎందుకో తనకీ అగ్నిపరీక్ష పెట్టాడు. జీవితంచేసే సవాలునుఅందుకుని నిత్యజీవితపోరాటంలో ఎదురయ్యే అపజయాలు, బాధలు, సమస్యలను చిరునవ్వుతో స్వీకరించటం, జగన్నాథం చిన్న వయసులోనే అలవరుచుకున్నాడు.

డాక్టరుసలహా మనసులోపెట్టుకున్నాడు. కామేశ్వరికి అనుమానంకలగని పరిస్థితులు కల్పించుకున్నాడు. కాని ఎంతకాలం? తనకు విశ్రాంతి కావాలి. విశ్రాంతికాలంలో కుటుంబాన్ని పోషించుకోడానికి డబ్బుకావాలి.

జగన్నాథం పనిచేస్తున్న లైబ్రరీ ప్రైవేటుసంస్థ. కమిటీ మేనేజమెంటులో వున్నది. కమిటీప్రెశిడెంటును తను చూసి డాక్టరుయిచ్చినసలహా విశదపరచి మూడునెల్లు శెలవు కావాలని కోరాడు. కమిటీమీటింగుపెట్టి లైబ్రేరియన్ విషయము చర్చించిన తర్వాత, ప్రెసిడెంటు జగన్నాథాన్ని పిలిపించాడు.

" నీకు నెలరోజుల జీతంతో శెలవు మంజూరుచేయడానికి కమిటీ ఒప్పుకున్నది. కాని యీ శెలవు పూర్తికాగానే వచ్చి డ్యూటీలోచేరకపోతే, ఉద్యోగం మరొకరికిపోయి నీకు విశ్రాంతిమాత్రం మిగులుతుంది. " అన్నాడు.

జగన్నాథానికి చుర్రుమంది. కమిటీనిర్ణయంలో లోపంలేకపోవచ్చు. ప్రెశిడెంట్ చెప్పే పద్ధతి అమానుషంగా వుంది. రక్తంవుడికి ప్రెశిడెంటుతో అన్నాడు.

"గ్రంథాలయానికి ఆరేళ్లు నేనుచేసిన సేవకు, గ్రంథాలయంయొక్క ఉపయోగాన్ని పాఠకులకు పూర్తిగా అందుబాటులో వుంచినందుకు, ప్రతిఫలం గుండెల్లోంచి దూసుకుపొయ్యే తుపాకిగుండులాంటి మీ రస్నమాటే కదూ? "

అర్థంఐందేమో ప్రెశిడెంటు కొంచెం చికాకుపడ్డాడు, " ఇదుగో జగన్నాథం. బాగా చదువుకున్నవాడినని యిట్లా అర్థాలుతీస్తే- "

ప్రెశిడెంటుమాట విరిచేసినట్లు ' వస్తా ' నని జగన్నాథం వెనుతిరిగి సుడిగాలిలా ఇంటిముఖంగా వెళ్ళిపోయాడు.

కమిటీమెంబర్లలో జగన్నాథానికి చాలామంది తెలుసు. అంతా తనను పొగిడి, తన ఓర్పుకూ విజ్ఞానానికి రాత్రింబవళ్ళుపడుతున్న కష్టానికీ అభినందించినవాళ్ళే. కాని రాకరాక తనకొక అవసరమొచ్చినప్పుడు ఒక్కరూ సహాయపడలేదు. తనవిషయం చర్చించి నిస్పృహకలిగించే నిర్ణయం చేశారు.

జగన్నాథం యింట్లో అడుగుపెడుతుండగానే పద్మ ఎదురువచ్చి " బాబాయ్! రాఘవేంద్రరావుగారట. మిమ్మ

లిని అర్జంటుగా రమ్మని మనిషితో కబురుపెట్టారు " అని చెప్పింది. జగన్నాథానికి నీరసంగా వున్నది. ఐనా వీధిలోకి వచ్చి రిక్షా చేసుకుని రాఘవేంద్రరావుగారింటికి పోనిమ్మన్నాడు.

రాఘవేంద్రరావు కమిటీకి ఎన్నికైన కొత్త మెంబరు. చిన్న వయసులోనే ఆవరస్సచదివి స్వతంత్రమైన వ్యాపారం చేస్తున్నాడు. అంతకుమించి ఆతని బాగోగులు జగన్నాథానికి తెలియవు.

తనకబురందినందుకు వెంటనే వచ్చిన జగన్నాథాన్ని చూసి ఎంతో ఆప్యాయతతో ఆహ్వానించి గౌరవించాడు రాఘవేంద్రరావు. జగన్నాథానికి ఆ వాతావరణమంతటిలో సహృదయత కనిపించింది

"మా కమిటీనిర్ణయం నాకు బాధకలిగించింది. నేను మీకు తెలియకపోయినా మీరు నాకు తెలుసు. నా వ్యక్తిగతసానుభూతి తెలపడంకోసం మీకు కబురుపెట్టాను." అంటూ రాఘవేంద్రరావు ఒక మూసిన కవరు అందించాడు.

జగన్నాథం కొంచెం సంశయించాడు, "మీ సహృదయతకు ధన్యవాదాలు. విషయం తెలుసుకోకుండా ... తీసుకోను." అన్నాడు సంతోషంగా చూస్తూ.

రాఘవేంద్రరావు చాలా వుషారైనమనిషి. మనసార నవ్వుతూ జగన్నాథంచెయ్యి తెరచి కవరు చేతిలో వుంచి అన్నాడు. "నా మనసులో వున్నది చెప్పాను. కవరులో వున్నది మీరే చూస్తారు. ఐనా ప్రేమతో, అభిమానంతో లభించిన దేన్నైనా అందుకోవలసిందే గదా."

జగన్నాథం మందహాసంచేసి కవరు అందుకొని జేబులో పెట్టుకొని అన్నాడు, "మీరు మనస్ఫూర్తిగా పనిచేస్తారు. సమయస్ఫూర్తితో మాట్లాడుతారు. మీఎడల నా హృదయంలో వుబికివస్తున్న కృతజ్ఞతను మాటల్లో చెప్పలేక పోతున్నాను."

రాఘవేంద్రరావుకు టెలిఫోనులో పిలుపువచ్చింది. లేస్తూ అన్నాడు. "మీరు శానిటోరియంలో చేరడానికి నిర్ణయించుకోగానే నాకు చెప్పండి. ఆవిషయంలో నేను కొంత సాయపడగలననుకుంటాను."

జగన్నాథం చిత్రమైన అనుభవంతో వుల్లాసంతో నిండిన మనసుతో బయటపడ్డాడు. తనను సహాయపడటానికి రాఘవేంద్రరావు కవరులో కొంత డబ్బువుంచి యిచ్చారని తనకు బోధపడింది. రాఘవేంద్రరావు యింత త్వరలో తనను గురించి ఎలా తెలుసుకున్నాడా? అన్న విషయం జగన్నాథానికి బోధపడలేదు.

ఆరాత్రి భోజనాలసమయంలో జగన్నాథం మనసు తెలుసుకుని "మీ వ్యాధి విషయంలో డాక్టరుగారిఅభిప్రాయం మీ మనసులోనే ఆగిపోయిందేం?" అనడిగింది కామేశ్వరి.

"ఆగిపోలేదే" జగన్నాథం ఆలోచించకుండానే తక్కున అన్నాడు. కామేశ్వరి మళ్ళీ అందుకుంది. "ఐతే నాకు చెప్పారా!"

లాటరీలో అణాకాసువేసినట్లు మళ్ళీ ఒక చెణుకు వేశాడు జగన్నాథం. "నేను చెప్పకముందే నీకు తెలిసిందిగా?"

కామేశ్వరి కొంచెం చకితురాలయింది. తనకు యీ విషయం తెలుసని జగన్నాథానికి ఎలా తెలిసింది. అనుమానం తీరక "రాఘవేంద్రరావుగారింటికి వెళ్ళారా?" అని అడిగింది.

కామేశ్వరి సూక్ష్మదృష్టిని జగన్నాథం అర్థంచేసుకున్నాడు; చిరునవ్వునవ్వి అన్నాడు. "దొంగవు కామూ! రాఘవేంద్రరావుగారి జవానుదగ్గర యీ భోగట్టా తెలుసుకున్నావుకదూ?"

"దొంగ నెలా ఔతాను. రాణీలాగా తెలుసుకున్నాను. రాఘవేంద్రరావుగారి పనివాడు యింతకుముందు మా స్కూల్లో పనిచేసిన జవానే. హిందీపాఠాలకు మనింటికి వచ్చే శాంత రాఘవేంద్రరావుగారి కూతురేనండి" అన్నది.

జగన్నాథానికి విషయం ఇప్పుడు బోధపడింది. తనలో మిగిలిపోయిన అనుమానాలకు క్షణంలో జవాబులు దొరికాయి.

తన జబ్బు నిజస్వరూపం కామేశ్వరికికూడా తెలిసిపోయింది. శానిటోరియంలో చేరమని యిహ తను పట్టుబడుతుంది. ఆదాయంవచ్చే ఉద్యోగం మానుకుని తనవ్యాధికి ఎలా డబ్బు జమపెట్టడం అన్నది జగన్నాథానికి మరొకగడ్డు సమస్య అయింది.

# 9

పండ్లకొట్టువుద్యోగానికి రాజీనామాయిచ్చిన తర్వాత రమణయ్యను కలుసుకోడానికి రాజారావుకు మనస్కరించ లేదు. ఎలాగైనా మరొక ఉద్యోగం సంపాదించి జీవనోపాధి కల్పించుకోవాలని, తన జేబులోవున్న కొద్దిడబ్బు జాగ్రత్తగా వాడుతూ రెండురోజులు మద్రాసులోని మారుమూల ఆఫీసులు, వ్యాపారకేంద్రాలుకూడా గాలించాడు. ప్రయోజనం లేకపోయింది.

ఆ రోజుపొద్దుటనుంచి మధ్యాన్నం ఒంటిగంటవరకు మౌంటురోడ్డులోని షాపులన్నీ విచారించాడు సాధారణ గుమాస్తావుద్యోగమైనా దొరుకుతుందేమోనని. ఎక్కడా ఖాళీలు దొరకలేదు. తనువెళ్ళిన అనేకచోట్ల తనవంటి నిరుద్యోగులు దరఖాస్తులతో ఎదురుపడ్డారు. ఈనాటిసమాజంలో వుద్యోగ అవకాశాలు తగ్గుతున్నాయో లేక నిరుద్యోగుల సంఖ్య పెరుగుతున్నదో రాజారావుకి బోధపడలేదు.

రాజారావు తిరిగితిరిగి బాగా అలసిపోయాడు. ఈ మూడురోజులూ కార్పొరేషను కొళాయిలు, బస్‌స్టాపు షెడ్‌లు తనకు ఆశ్రయమిచ్చాయి. తనస్థితికి తనకే నవ్వు వస్తున్నది. కడుపులో ఆకలి రెపరెప పెనవేసుకవస్తున్నది. జేబుతడివి చూసుకుంటే, రెండు అణాకాసులు మిగిలాయి. ఒకగుక్కెడు కాఫీతాగి, ఆకలికి జవాబుచెబుదామని వుడిపి కృష్ణాహోటల్లోకి వెళ్ళాడు. హోటలు చాలా రద్దీగావున్నది. రాజారావు వెళ్ళి ఒక కుర్చీలో కూర్చున్నాడు. ఎదురుగా

ఎవరో యిద్దరుమిత్రులు వుద్యోగవిషయాన్ని గూర్చి మాట్లాడుకుంటున్నారు. ఆ సంభాషణ రాజారావుదృష్టిని ఆకర్షించింది. పరధ్యానంగా చూస్తూనే ఆ సంభాషణశ్రద్ధగా వినడానికి ప్రియత్నించాడు.

ఇంతలో సర్వరు రానేవచ్చాడు. అనాలోచితంగా దోసెకు ఆర్డరుయిచ్చి, సర్వరును పంపేశాడు. స్నేహితులు మాట్లాడుతూనేవున్నారు.

మొదటివాడు అడిగాడు. "ఇంతకాలం వుద్యోగం దొరక్క అవస్థపడ్డావు. తీరా ఖాళీదొరికాక భోగోగులు, గౌరవమర్యాదలు ఆలోచిస్తూ కూచుంటే ఎలారా?"

రెండవవాడు అన్నాడు, "ఉద్యోగంలేకపోతే పస్తులుంటాను. ఆనప్ప ప్యాసయి, అంబత్తూరులో రోడ్డు కూలీలకు మేస్త్రీగా నేను ఉద్యోగంచేయలేనురా."

మొదటివాడు రెండవవానిని వీపు చరిచి జీవితంలోని లోతులను, ప్రారంభంలో మనిషికివుండవలసినఓర్పునుగురించి బోధించడం మొదలుపెట్టాడు. రెండవవాడు స్నేహితుడు చెప్పేమాటలకు వూకొడుతూ మనసు మరొకచోటికి పరుగెత్తిస్తున్నాడు.

రాజారావు యాంత్రికంగానే దోసెతిని కాఫీతాగాడు. ఆ స్నేహితులసంభాషణలోని సారాంశాన్ని అర్థంచేసుకున్నాడు. సర్వరుయిచ్చిన బిల్లుమడిచి పట్టుకొని వుద్యోగంతో రోడ్డుమీదికి వచ్చి నడకసాగించాడు. సెంట్రలు స్టేషను దగ్గరికి వచ్చినతర్వాత చేతులోఉన్న బిల్లువిషయం గుర్తువచ్చింది. పొరపాటు జరిగింది; కాని ప్రమాదంకూడా తప్పింది.

ఇప్పుడు వెళ్ళి బిల్లు చెల్లించదలచినా, తనజేబులో రెండు అణాకాసులకుమించి డబ్బులేదు. జీవితంలో ఒక్కొక్క మారు పొరపాట్లే ప్రమాదాలు తప్పిస్తాయి; గౌరవాన్ని నిల బెడతాయి.

రాజారావు అంబత్తూరుకు దారి తెలుసుకొని, తిన్నగా ఆ వూరికి నడకసాగించాడు. ఆ గ్రామం చేరేప్పటికి సాయం కాలమైంది. తను వెళ్ళేప్పటికి రోడ్డుకూలీలంతా పని ఆపుచేసి తమసామాన్లు సర్దుకొని యిళ్ళకు వెళ్ళే ప్రయత్నంలో కంట్రాక్టరుదగ్గర కూలి తీసుకుంటున్నారు. కంట్రాక్టరు మధ్యవయస్కుడు. డబ్బుసంపాదనలో తన శరీరంవిష యం మరచిపోయాడేమో, గుడ్డలు మురికిపట్టి ఉన్నాయి. దళసరి చారలకోటు వేసుకున్నాడు. తలకు గుడ్డచుట్టుకొని, కళ్ళకు దళసరిఅద్దాలజోడు పెట్టుకున్నాడు. లెక్కలుచూసి, ఒకొక్కకూలీని పేరుపేరున పిలిచి, డబ్బులిచ్చి పంపుతు న్నాడు. రాజారావు కొంచెం దూరంగా కాచుకుని కూచు న్నాడు.

కూలీలరితా వెళ్ళిపోయాక ఆరోజు జమాఖర్చులు పరిచూచుకుంటూ కూర్చున్నాడు కంట్రాక్టరు. రాజారావు దగ్గరగా వెళ్ళి చేతులుకట్టుకొని నిలుచున్నాడు.

కంట్రాక్టరు రాజారావును గమనించి జారిపోయిన ముక్కద్దాలగుండా తేరిపారచూసి "ఎవరయ్యా నీవు?" అన్నాడు.

రాజారావు వినయంగా, నమ్రతగా జవాబిచ్చాడు, "మీదగ్గర మేస్త్రీపనికి ఖాళీవున్నదని తెలిసి వచ్చాను."

కంట్రాక్టరు లెఖ్ఖలుమానేసి తాపీగా కూచుని అడిగాడు, "ఖాళీవుంది. నెలకు నల్భై రూపాయల జీతం."

రాజారావుకి కొంచెం ఆశ్చర్యంకలిగింది. "జీతం కొంకు యాభై రూపాయలని పేపర్లో వేశారుటకదా?" అన్నాడు.

కంట్రాక్టరు విచిత్రంగా నవ్వాడు. "పేపర్లో వేసినమాట నిజమే." తన జేబులోంచి కొన్ని దరఖాస్తులుతీసి చేతుల్లో పట్టుకొని గాలిలో వూపాడు, "చూడవయ్యా, బి.ఏ. చదివిన వాళ్ళూ, అనర్సుప్యాసయినవాళ్ళూ దరఖాస్తులు పంపారు. వాళ్ళే యాభైరూపాయలకు సిద్ధపడితే, నీవేం చదివావో గాని, నీకెంత యివ్వొచ్చో ఆలోచించు."

ఆ కంట్రాక్టరుతో వాదనకు దిగటానికి ఎందుకో రాజారావుకు మనస్కరించలేదు. తనకు ఉద్యోగం కావాలి. ఆశాభరితమైన భవిష్యత్తును పొందటానికి జీవనోపాధి కావాలి.

కంట్రాక్టరు చెప్పుకుపోయాడు. "ఇంకా దరఖాస్తులకు జవాబులు వ్రాయలేదు. ఎవరైతే నాకేం; పాపం! వెతుక్కుంటూ వచ్చావు. నీకు యిష్టమైతే రేపువుదయమే ఉద్యోగంలో చేరవచ్చు."

రాజారావు సమాధానంచెప్పలేదు. తలఆడించి తన అంగీకారాన్ని సూచించాడు. కంట్రాక్టరు రాజారావును వెంటపెట్టుకుని వెళ్ళి, రోడ్డుపనిజరిగేస్థలానికి దగ్గర్లోనే ఒక పెంకుటింట్లో ఒకగది బాడుగకు యిప్పించాడు. హోటల్లో భోజనానికి ఏర్పాటుచేశాడు. మంచిమనసులోవున్నాడేమో ఖర్చులకు పదిరూపాయలు అడ్వాన్సుకూడా యిచ్చి, మరునాడు వచ్చి పనిలో చేరమని చెప్పి వెళ్ళాడు.

రాజారావు ఆచూకీ తెలియక రమణయ్య చాలా బాధపడ్డాడు. హోల్‌సేల్ పండ్లదుకాణానికి వెళ్ళి విచారించాడు. అక్కడ తెలిసిన వివరాలు, రాజారావు రాజీనామా యిచ్చి వెళ్లిపోయిన పరిస్థితులు రమణయ్య బాధను రెట్టింపు చేశాయి. మద్రాసులాంటి మహాపట్టణంలో రాజారావు ఆచూకీ ఎలా తెలుసుకోవటం? తనకు తెలిసిన ప్రదేశాల్లో తనకు తెలిసినవాళ్ళద్వారా విచారిస్తూనే వున్నాడు.

ఒకనాడు రమణయ్యకు పాతపరిచయస్తుడు ఒకడు కనిపించాడు. మాటలసందర్భంలో తాను అంబత్తూరులో రోడ్డు పనికూలిగా పని చేస్తున్నాననీ, తమపనికి కొత్తగా రాజారావనే మేస్త్రీ వచ్చాడనీ, బాగా చదువుకున్నవాడనీ, మంచివాడనీ చెప్పుకవచ్చాడు. తియ్యని కబుర్లుచెబుతూ కష్టం తెలియకుండా పనిచేయించే ఆ మేస్త్రీని మెచ్చుకున్నాడు.

పాతపరిచయునివల్ల లభించిన సమాచారానికి రమణయ్య చాలా సంతోషపడ్డాడు. రాజారావును వెళ్లి కలుసుకుని అతని కష్టసుఖాల్లో తొంగిచూసి, చురుకుపాలు పోసి రావాలని నిశ్చయించుకున్నాడు.

రాజారావును కలుసుకోడానికి సిద్ధమై రమణయ్య వీధి వాకిలివగ్గరకు వస్తుండగానే 'పోస్టు' అంటూ పోస్టుజవాను ఎదురై రమణయ్య కేరాఫ్‌తో రాజారావుకు వచ్చిన ఒక కవరు అందించాడు. రమణయ్య తనకున్న కొద్ది అక్షరజ్ఞానముతో ఆ కవరు గుంటూరునుంచి వచ్చిందనీ, అతని స్నేహితులెవరో వ్రాసివుంటారనీ వూహించాడు. ఆ కవరు ద్వారా

రాజారావు కేదైనా సంతోషవార్త అందచేయగలుగుతే తను అదృష్టవంతుడననీ, తనలో తాను అనుకున్నాడు.

రమణయ్య అంబత్తూరు చేరేప్పటికి సూర్యుడు అప్పు డప్పుడే తనవేడికిరణాలను ప్రసరింపచేస్తున్నాడు. రోడ్డుపని జరిగేచోటుకు వెళ్ళాడు. రాజారావు నడుము కొక గుడ్డచుట్టు కుని హాయిగొలిపే పాటపాడుతూ కూలీలచేత కులాసాగా పనిచేయిస్తున్నాడు. రమణయ్య రాజారావుకు దగ్గరగావెళ్ళి 'బాబూ' అని పిలిచాడు. రాజారావు వెనుదిరిగి చూసి, ఉదాసీనంగా చిరునవ్వునవ్వాడు. ఆప్యాయంగా రమణయ్యను తీసుకొని చెట్టునీడకు వెళ్ళాడు.

"నా భోగట్టా మీకెలా తెలిసింది?" అని రాజా రావు మందహాసం చేశాడు, "ఎంత అభిమానంతో వెతు క్కుంటూ వచ్చారు!"

రమణయ్య హుందాగా జవాబుచెప్పాడు. "మనసు వుండాలిగాని మార్గం లేకపోతుందా నాయనా! ఇదుగో నీ పేర యీ కవరు వచ్చింది"

రాజారావు జాబు అందుకొని, తెరచి చదువుకు న్నాడు. అతనిముఖం సంతోషంతో వికసించింది. "రమ ణయ్యబాబాయ్! మీరు వూరికే రాలేదు. నా జీవితంలో అలుముకున్న చీకటికి యీ వుత్తరంద్వారా ఒక వెలుగు కిరణం తీసుకువచ్చారు." అన్నాడు.

"అదేమిటి బాబూ" అన్నాడు రమణయ్య పెరిగిన గడ్డాన్ని సవరించుకుంటూ. "ఐతే నే ననుకున్నట్లు సంతో షవార్తేనన్నమాట" అన్నాడు.

రాజారావు వుత్తరంలోని సంగతులు విశదపరిచాడు. ఆ వుత్తరం మదాసులోని 'నవశోభ' పత్రికసంపాదకుడు తనపేర గుంటూరుకు వ్రాశాడు. గుంటూరు పోస్టువాళ్ళు మళ్ళీ దానిని రమణయ్య కేరాఫ్‌కు మదాసు పంపారు. రాజారావు చాలా రచనలుచేసివుండటంవల్ల, పుస్తకాలు వ్రాసివుండటంవల్ల తమ "నవశోభ" పత్రికకు సహాయ సంపాదకుడు కావాలని, ఇష్టమైతే వచ్చి వెంటనే చేరవచ్చునీ వున్నది.

జాబులోని వివరాలు తెలుసుకున్నాక ఆపదలోవున్న వాళ్ళకు భగవంతుడు ఎలా తనచేతిని అందిస్తాడో ప్రత్యక్షముగా మరొకమాటు తెలుసుకున్నాడు.

రమణయ్య ఆరోజు రాజారావుతో వుండిపోయాడు. రమణయ్య అభిమతాన్నికూడా తెలుసుకొని ఆ నెలాఖరుకు మేస్త్రీపనికి రాజీనామాయిచ్చి "నవశోభ" కార్యాలయంలో చేరాలని రాజారావు నిశ్చయించుకున్నాడు.

## 10

తన ఏర్పాటుప్రకారం రాజారావు మేస్త్రీపని వదులుకుని, ఒకనాటిఉదయం 'నవశోభ' కార్యాలయానికి వెళ్లాడు. ఆ పత్రికకార్యాలయం లింగిచెట్టివీధిలో ఒక పెద్ద భవనంలో ఓచిన్నగదిలో వున్నది. రాజారావు పత్రికఆఫీసైతే సులభంగానే తెలుసుకోగలిగాడు. ఆఫీసుగది బయట 'నవశోభ కార్యాలయం' అని బోర్డుఉంది. కిటికీగుండా చూస్తే, ఆఫీసు అంతర్భాగం స్పష్టంగా కనిపిస్తున్నది. ఒకమేజా, రెండు కుర్చీలు, టేబుల్‌ఫాను, స్టేషనరీసామానులు, పత్రికలు పుస్

కాలు పెట్టిఉన్న ఒక పెద్దబీరువా– ఈ వాతావరణం చూసి, రాజారావు తనలో తాను నవ్వుకున్నాడు. 'నవశోభ' సంపాదకుడు ఏ వేళకు వస్తాడని ఇరుగుపొరుగు ఆఫీసులో విచారించాడు. ఆ సంపాదకుని పేరు రాఘవాచారనీ, అతను ప్రతిరోజూ ఆఫీసుకు రాడనీ, వచ్చినరోజు పదకొండు, పన్నెండు గంటలప్రాంతంలో వస్తాడనీ, చెప్పారు. రాజారావు వరండాలో కాచుకునికూర్చున్నాడు. సహాయసంపాదకునిగా తన భవిష్యత్ జీవితానికి రూపురేఖలు దిద్దుకుంటూ.

పన్నెండుగంటలు దాటినతర్వాత రాఘవాచారి ఆఫీసుకు వచ్చాడు. తలుపు తెరిచి, మేజా, కుర్చీలు తుడుచుకుని ఫాను వేసుకుని కూర్చున్నాడు. తలుపుదగ్గరగా వచ్చి నిలుచున్న రాజారావునుచూసి, చిరునవ్వుతో స్వీకరించి, 'ఎవరు నాయనా నీవు?' అన్నాడు.

రాజారావు మందహాసంచేస్తూ, 'నవశోభ' కార్యాలయంనుంచి తనకువచ్చిన కవరుతీసి అందించాడు. రాఘవాచారి కవరును అటూయిటూ త్రిప్పిచూసుకుని, తనలోతను ముసిముసినవ్వులు నవ్వుకుని అన్నాడు, "ఓహోహో,నా జాబుకన్న ముందు నా సంకల్పబలమే నిన్ను మద్రాసుకు తెప్పించిందన్నమాట. నీకీ జాబువ్రాశాక ప్రతిరోజూ, ప్రతిక్షణం నిగురించి అనుకుంటూ నేవున్నాను. సరి, నా బరువు, బాధ్యత సగం తగ్గిపోయాయి. పోతే– ఉద్యోగంలో చేరడానికి సిద్ధంగావున్నావా నాయనా!"

రాజారావు రాఘవాచారిధోరణిని అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తూ ఔనన్నట్లు తలపంకించాడు.

రాఘవాచారి మళ్ళీ చెప్పుకపోయాడు,

"నీవు సహాయసంపాదకుడుగా చేరినా పత్రిక నీదే నాయనా. నీకు పారితోషికంగా నెలకు యాభైరూపాయలు యిస్తాను. నీ మకాం ఆఫీసులోనే పెట్టుకోవచ్చు. ఎదురుగానే భోజనహోటలున్నది."

"నేను జీవితంలో వృద్ధికిరావలసినవాడిని" అన్నాడు రాజారావు కృతజ్ఞతా సూచకంగా. "మీ అభిమతానికి నేనేం వ్యతిరేకం చెప్పను. మీవంటిపెద్దల ఆదరాభిమానాలు నాకు కావాలి."

రాఘవాచారి తృప్తిగా నవ్వుకున్నాడు. రాజారావు నమ్రత, శాంతస్వభావము ఆయన్ను బాగా ఆకర్షించాయి.

క్రిందటిరోజు వుత్తరాలన్నీ ఫైలుచేసుకుని, తనకు వెంటనే యింటికివెళ్ళవలసిన పనివుండటంవల్ల, ఆతిథ్యమివ్వాలని రాజారావునికూడా వెంటపెట్టుకుని, తన నివాసం సైదాపేటకు వెళ్ళాడు.

రాఘవాచారి బలవంతంవల్ల అతనిఇంట్లోనే రాజారావు రెండురోజులు గడిపాడు. ఈ రెండురోజుల్లోనూ అతనికి రాఘవాచారి గృహజీవితం కొంతవరకు బోధపడింది. రాఘవాచారిభార్య ఒకతరహా మనిషి. ఎప్పుడూ రుసరుసలాడుతూ వుండేది. చిన్న అసౌకర్యాన్ని చాలా బాధాకరంగా చిత్రించుకుని మథనపడేది. పేరాశకు, అసూయకు ఆమె ప్రతిబింబంగా కనుపించేది. గృహజీవితం సంతోషదాయకంగా చేసుకోవటం ఆమెవల్ల కానిపని.

అస్తమానం పిల్లలను తిడుతూ, కొడుతూ, వున్న ఆస్తి కాస్తా కరిగిపోయిందనీ, వస్తువాహనాలు లేవనీ, రాఘవాచారిని ఆడిపోసుకునేది.

ఇంతటి బాధాకరమైన గృహజీవితాన్ని భరించగలిగిన రాఘవాచారిఓర్పుకు రాజారావు చకితుడయ్యాడు.

రాజారావు బరువును, బాధ్యతను స్వీకరించి ఏలోటు లేకుండా సంపాదకత్వంలో సహాయపడుతున్నాడు. కాని కాలక్రియమాన రాఘవాచారి మనస్తత్వానికి, 'నవశోభ' పరిస్థితులకు అనుగుణంగా నడచుకోవడానికి రాజారావుకు తన నీతినియమాలను పాటించడం అసంభవంగా తోచింది.

రాఘవచారి వ్యక్తిగతంగా మంచివాడు. దురభ్యాసాలు ఏమీలేవు. నిరాడంబరమైన జీవితం గడుపుతాడు. అతనిలో పట్టుదల, ఓర్పు, తృప్తి జీర్ణించుకపోయాయి. అందువల్లే తన ఆదర్శాలకోసం ఆస్తినంతా పత్రికానిర్వాహణలో పోగొట్టుకున్నాడు. అతనిచేతుల్లో మూడుపత్రికలు పుట్టి పోయాయి. నాలుగవది "నవశోభ". రాఘవాచారి సంసారం పెద్దది. ముసలితల్లి, భార్య, నలుగురుపిల్లలు, పోరంబోకు బావమరది.

పత్రికతాలూకు బాకీలు త్వరగా వచ్చేవికావు. ప్రకటనకర్తలు, ఏజంట్లు డబ్బు సకాలంలో అందచేసేవారుకాదు. అప్పటికప్పుడు అప్పోసప్పో తెచ్చి ఒకపక్క పత్రిక ప్రకటించి, మరొకవంక యిల్లు దిద్దుకోవలసివచ్చేది. ఈవిధంగా నవశోభకు తలలో వెంట్రుకలన్ని అప్పులవాళ్లు తయారయ్యారు.

రాఘవాచారి అప్పులవాళ్ళబారినుంచి తప్పించుకో టానికి రోజులకురోజులు, ఆఫీసువంకే వచ్చేవాడుకాదు. వచ్చినవాడికల్లా కాస్తోకూస్తో యిచ్చి సర్ది చెప్పి పంపవలసిన బాధ్యత రాజారావుమీద పడింది.

రాఘవాచారివిషయంలో ఎందుకో రాజారావుకు ప్రత్యేకమైన సానుభూతికలిగింది. ఉత్తరప్రత్యుత్తరాలవల్ల ఏజంట్లనుంచి వీలైనంతడబ్బు రాబట్టి, ప్రకటనదార్లవద్దకు నేరుగావెళ్ళి వసూలుచేసి అప్పులవాళ్ళ సర్దిజేసి రాజారావు కొంతవరకు ఎదుర్కొనగలిగాడు.

ఈ పరిస్థితుల్లో రాజారావుదగ్గర వున్న కొద్దిపైకం కూడా ఖర్చయింది. పత్రికయొక్క పలుకుబడితో రాజారావు తనవ్రాసిన నాలుగునవలలు ఒక ప్రముఖ ప్రచురణకర్తకు అమ్మగలిగాడు. కాని పారితోషికంగా వచ్చిన ఐదొందలు 'నవశోభ' అప్పులవాళ్ళకు పంచవలసివచ్చింది.

'నవశోభ' వ్యవహారాల్లో తనవ్యక్తిత్వం దెబ్బతినే స్థితి వచ్చినప్పుడు రాజారావు చాలా బాధపడి కుంగిపోయే వాడు. కాని ఎందుకో 'నవశోభ' తోడి తనసంబంధాన్ని అక స్మాత్తుగా తెంచుకుని పోలేకపోయాడు. పోనీ, రాఘవాచా రికి మరొకవ్యాపారమేదైనా చేయమని సలహాయిద్దామనుకు న్నాడు. కాని అతనికి వయసుమళ్ళింది. దీనికితోడు అప్పు లన్నీ అలాపెట్టుకొని పెట్టుబడికి డబ్బు ఎలాపుట్టించడం ?

తనకున్న కొద్దిఅనుభవంతో 'నవశోభ' ను ప్రచు రిస్తూనే అప్పులనుండి బయటపడేమార్గం ఏమిటా అని దీర్ఘ ఘంగా యోచించాడు రాజారావు. రాఘవాచారితో చర్చించి

ఒక పథకం తయారుచేశాడు. దీనికి పెట్టుబడి ప్రోత్సాహకర్త శర్మాను.

'నవశోభను' దీపావళికి పారిశ్రామిక సంచికగా, సర్వాంగసుందరంగా ప్రచురించాలి. ప్రముఖ రచయితల, పారిశ్రామిక వేత్తల రచనలు వేయాలి. పరిశ్రముల, వ్యాపార స్థల ప్రకటనలు విశేషంగా సంపాదించాలి. ఇదీ పథకం.

రాజారావు తు. చ. తప్పకుండా పథకాన్ని అమల లో పెట్టాడు. అహోరాత్రులు శ్రమించి, అద్భుతంగా సంకలనం చేసి ప్రచురించాడు. ఎన్నో మెచ్చుకోలు ఉత్తరాలు వచ్చాయి. అపరిమితంగా ప్రకటనలు వచ్చాయి.

రాజారావు అడుగుపెట్టి ప్రకటన సాధించలేని వ్యాపార కేంద్రంగాని, పరిశ్రమగాని లేదు. కాని కవరు అట్ట పేజీకి మూడువందల రూపాయలు ఆదావచ్చే ప్రకటనకోసం సెంట్రల్ ఇండస్ట్రీ యజమానికోసం ఐదుసార్లు ప్రయత్నించాడు. ఆయన దొరకలేదు.

చివరిప్రయత్నంగా సెంట్రల్ యిండస్ట్రీ యజమాని నందకిశోర్ను కలుసుకోవడానికి రాజారావు ఆయన బంగాళాకు వెళ్లాడు. ఈసారికూడా ఆయన ప్రసన్నసూచనలు కనిపించలేదు. విశాలమైన ఆ బంగళాహాల్లో కూచుని ఒక యువతి నవలాపఠనంలో మునిగివున్నది. రాజారావు ధైర్యంగా ఆమెసమీపంలోకి వెళ్ళి గొంతు సవరించుకొని, వందనం చేశాడు. ఆమెదృష్టి మరలలేదు. రాజారావు యీసారి మరి కొంచెం స్పష్టంగా "నమస్తే!" అన్నాడు.

ఆమె తొట్రుపడి తిరిగిచూసి, తను చదువుతున్న పేజీ మడిచి పుస్తకం టేబులుమీద వుంచింది.

"ఎవరు కావాలి ?" అన్నది.

రాజారావు ఛట్టున వూహించాడు, ఆమె సందరీ శేఖర్ మూర్తి కుమార్తె యుండాలని. చిరునవ్వుతో జవాబిచ్చాడు — "నాన్నగారిని చూడాలని నాలుగైదుసార్లు వచ్చినా దొరకలేదు.

ఆవిడ పరధ్యానంగా నవ్వి నవల పేజీలోకిచూసుకుని, "నాన్నగారు ఢిల్లీ వెళ్ళారు. రెండునెలల తర్వాత వచ్చి చూడండి;" అన్నది పుస్తకం తెరచి.

రాజారావు కిక సంభాషణపొడిగించే అవకాశం కనిపించలేదు. కాని, ఆమెచేతిలోని పుస్తకంపేరు చూచాక మెరపులాంటి ఆలోచన తట్టింది. .

"క్షమించండి... మీరు చదువుతున్ననవల 'చితికిన బ్రతుకులు' కదూ?" అన్నాడు.

ఔనన్నట్లు ఆమె తలఆడించింది.

రాజారావు కొంచెం చొరవచేసుకుంటున్నాడు, "ఆ రచయిత వ్రాసిన యితరనవలలుకూడా మీరు చదివారా?"

ఆ యువతి మందహాసంచేసింది. తలవనితలంపుగా రాజారావులో ఆసక్తి గమనించి కుర్చీచూపి కూర్చోమని "మీకూ నవలలంటే యిష్టమా?" అన్నది.

"కష్టమైనా వివిధరచనలు చదవడానికి యిష్టపడటం మా వృత్తి...... ఇంతకూ ఆ నవలా రచయితనుగురించి మీ అభిప్రాయం చెప్పారు కాదు?"

"ఎవరో చెప్పండేం?" అన్నదామె తన అభిప్రాయం అంత తేలిగ్గా చెప్పదలచుకోనట్లు.

రాజారావుకు తప్పలేదు. "నేను "నవశోభ" పత్రిక సంయుక్త సంపాదకుడిని. నవీనసాహిత్యంగురించి పాఠకుల అభిప్రాయాలు సేకరించడం నా అభిరుచి.

ఆమె అందుకున్నది, "ఓహో యింకేం! సంపాదకులుగా యీ నవలారచయితను గురించి ఎన్నో అభిప్రాయాలు తెలుసుకునివుంటారు. మీ అభిప్రాయం శెలవివ్వండి."

"నాచేతే చెప్పిస్తారా!" అన్నాడు రాజారావుకొంచెం సానుభూతిపూర్వకంగా, "ఆ రచయిత యీ మధ్య ప్రచురించిన 'చితికిన- బ్రతుకులు' ఎదలోనిరొద, త్రిశంకుస్వర్గం 'నాస్తిక జీవులు—' ఈనాలుగునవలలూ చదివాను. వాస్తవం చెప్పాలంటే వొట్టి చౌకబారునవలలు. అన్నట్లు లాస్టుగ్రేడు రచయిత — ఫస్టుగ్రేడు ..."

"చాలు చాలు, ఆపండి," ఆమెముఖం కందగడ్డలా ఎర్రబడింది. దీర్ఘవుచ్ఛ్వాస నిశ్వాసాలతో అన్నది, "క్షమించాలి. ఇప్పుడు మీరు చేసిన చౌకబారు విమర్శనుబట్టి చూస్తే, మీ వైజ్ఞానికసంపద, మీ మనోవికాసం స్పష్టంగా తెలిసింది."

రాజారావు కొంచెం బాధపడినట్లు నటించాడు. "మన్నించండి. నా అభిప్రాయం నేను చెప్పాను. మీ అభిమానరచయితను భూషించలేకపోయాను."

ఆమె కొంచెం సీరియస్‌గా ముఖంపెట్టి, అన్నది. "విమర్శించవచ్చు కాని సకారణంగా వుండాలి, అంధ్రదే

శంలోని నలుగు రైదుగురు ఉత్తమ రచయితల్లో ఒకరైన వీరిని మీరు హర్షించలేకపోవడం నిజంగా శోచనీయం''

"మీ అభిమానరచయితనుగురించిన నాఅభిప్రాయం మీకు బాధకలిగించినందుకు క్షమించాలి" అని వెళ్ళిపోయే ప్రయత్నంలో రాజారావు లేచి నిలుచుని పర్సులోంచి ఓ విజిటింగుకార్డు తీసి ఆమెకు అందించాడు. "నాన్నగారు వచ్చాక నేను వచ్చివెళ్ళినట్టు చెప్పండి. ఇంకోసారి వచ్చి కలుసుకుంటాను."

ఆమె విజిటింగుకార్డుతీసుకుని, చదివింది. ఆమెముఖంలో మరుక్షణంలో అమిత ఆశ్చర్యం, అసహనం ముంచు కువచ్చాయి. ఛట్టున నిలుచుని చేతిలోని విజిటింగుకార్డువంక చూస్తూ, "యం. ఆర్. రాజారావు. మీ అబద్ధపు అభిప్రా యంతో నన్ను పరిక్షించాలని చూసిన నాఅభిమానరచయిత తమరేననుకుంటాను!"

రాజారావు ముసిముసినవ్వులు నవ్వాడు. పరోక్షంగా రాజారావును దూషించినందుకు ఆమెకు సిగ్గుపోయింది; ప్రత్య క్షంగా తన అభిమానరచయితను కలుసుకోగలిగినందుకు పొంగిపోయింది.

ఆమె రాజారావును వెళ్ళనివ్వలేదు. కాఫీ, ఫలహారం తెప్పించింది. ఆ ఇద్దరి సాహిత్య సమీక్షలో మూడుగంటల కాలం దొర్లిపోయింది. ఆమె కొత్త అనుభూతిని, రాజారావు కొత్త అనుభవాన్ని పొందగలిగారు.

ఆమె టేబులుమీద వుంచిన పుస్తకం తిరగవేసి రాజారావు తెలుసుకున్నాడు-ఆమె పేరు తమ పత్రిక పేరులో ద్వితీయ భాగమని.

ఆమె గేటువరకూ వచ్చి, రాజారావుని సాగనంపుతూ వీలుకలిగినప్పుడల్లా తమయింటికి రావాలని కోరింది. మరునాడు మేనేజరుతో చెప్పి ప్రకటన పంపిస్తానని వాగ్దానం చేసింది.

'నవశోభ' గడ్డుజీవితంలో మరొక వెలుగురేఖను చూశాడు రాజారావు.

## 11

శోభ మాటయిచ్చినప్రకారం 'నవశోభ' ప్రత్యేక సంచికకు సెంట్రల్ యిండస్ట్రీ ప్రకటన రానూవచ్చింది; 'నవశోభ' ప్రత్యేకసంచిక సర్వాంగసుందరంగా అందాలు చిందుతూ వెలువడనూ వెలువడింది. 'నవశోభ' ప్రత్యేక సంచికతో వచ్చిన ఆదాయంతో రాజారావు పత్రిక తాలూకు కొన్ని పాతఅప్పులు తీర్చాడు. యింటిచిక్కులు తీరడానికి మిగతామొత్తం రాఘవాచారికి రొఖ్ఖంగా ముట్టచెప్పాడు. కాని మిణుగురుపురుగులా మెరిసిన ఈ ఆశ ఎంతకాలం? నెలరోజులు తిరగకముందే కొత్తఅప్పులు పాతఅప్పులను జత చేసుకునివచ్చి కరాళనృత్యంచేశాయి. అప్పులబాధ పెరిగే కొద్దీ రాఘవాచారి ఆఫీసుకురావడం తగ్గించుకున్నాడు. అప్పులవాళ్ళు ఉద్రేకప్రదర్శనకు వుపక్రమించాక రాఘవాచారి ఆఫీసుకు రావడం పూర్తిగా మానివేశాడు. అచ్చాఫీసు యజమాని, పేపరుసప్లయిదారు సత్యాగ్రహం చేయడంతో

నవశోభ ' ప్రచురణ ఆగిపోయింది. రాజారావు చిత్రమైనజీవితంలో మరొక విచిత్రమైన అనుభూతి పొందాడు.

" నవశోభ " ఆగిపోయిన తర్వాత రాజారావు ఒకమారు శోభను కలుసుకున్నాడు. ప్రత్యేకాభిమానంతో ఆమె రాజారావును ఆహ్వానించింది. తన తండ్రి నందకిశోర్‌కు అతనిని పరిచయంచేసింది. నందకిశోర్‌కుకూడా సాహిత్యపిచ్చి వున్నది. ఆయనా అంతకుముందే రాజారావునవలలు చదివారట. రాజారావుతో చిరునవ్వుతో కరస్పర్శచేసి, తరుచూ తమయింటికి వస్తూవుండమని అర్థించాడు.

మాటలసందర్భంలో శోభ రాజారావును 'నవశోభ' నిర్వహణనుగురించి ఏవో ప్రశ్నలువేసింది. సంభాషణక్రమములో "నవశోభ" ప్రచురణ నిలిచిపోయినవిషయం చెప్పడము రాజారావుకు తప్పనిసరైంది. ' నవశోభ ' నిలిచిపోయినందుకు శోభ చాలా నొచ్చుకున్నది.

రాజారావును సాగనంపుతూ " పత్రిక ఎలాగూ ఆగిపోయింది. మీరు కొంతకాలం మా అతిథిగా మా బంగళాలో వుండిపోగూడదా?" అని శోభ సూటిగా ప్రశ్నించింది. రాజారావు తొణకలేదు. ప్రశ్నను చిరునవ్వుతో స్వీకరించి సమాధానం వెతుక్కుంటూ ముందుకు సాగిపోయాడు.

మరునాడు రాజారావుమనస్సు మాటిమాటికీ వెళ్ళి శోభదగ్గర వాలడం ప్రారంభించింది. అతనికి ఆలోచన సాగలేదు. శోభబంగళాకు ప్రయాణంకడుతుండగా ఆంధ్రసాహితీ సభనుంచి తంతివచ్చింది – వాళ్ళు నిర్వహించిన నవలారచన

పోటీలో రాజారావునవల 'పరాజితులు' కు ప్రథమబహుమతి వెయ్యిరూపాయలు వచ్చినట్లు. రాజారావును మనస్సు, హృదయ ఉద్వేగంతో శోభబంగళాకు తీసుకువెళ్ళాయి.

సాహితీసభనిర్ణయం విని శోభ పులకితహృదయురాలయింది. మందహాసంచేసి రాజారావుకళ్ళలోకి చూస్తూ అన్నది.

" నేనూ మీకొక శుభవార్త చెప్పాలి "

" ఓహో! " రాజారావు పరిహాసంగా ఛేణుకు విసిరాడు, "నీ బర్త్‌డే దగ్గిరపడిందా శోభా!"

"రచయిత పప్పులో కాలువేశారు" శోభ సమయస్ఫూర్తిగా అన్నది. "కథకులఊహాలు ఎల్లప్పుడూ రైటుగా వుండవు. మా కంపెనీలో విక్రియశాఖమేనేజరు రిటైరైపోయారు. ఆ శాఖకు మేనేజరుగా నా అభిమానరచయితను వెయ్యడానికి నాన్న అంగీకరించారు. నెలకు ఐదొందలు ప్రతిఫలం. మా బంగాళాలోనే నివాసం"

రాజారావు చకితుడుకాలేదు. చిరునవ్వులోనే వుదాసీనత పొందాడు.

శోభకు సమాధానంకావాలి, అడిగింది, "రావుగారు మన్నించలేదా?"

రాజారావూ తగ్గలేదు. తననిర్ణయాన్ని వ్యంగ్యంగా చెప్పాడు, "అనుగ్రహించినవాళ్ళకు ఆగ్రహం తెప్పించడం నా అభిమతంకాదు."

శోభకళ్ళు అందంతో, ఆనందంతో మెరిశాయి. ఆమె ఆనాడు రాజారావుసమక్షంలో మాటలపుట్ట అయిపోయింది.

'నవశోభ' కార్యాలయంలో చేరాక, రమణయ్యనుకలుసుకోవడానికి రాజారావు రెండుమార్లు ప్రయత్నించాడు. కాని రమణయ్య తటస్థపడలేదు. మళ్ళీ యీనాడు రాజారావుమెదడులో రమణయ్య మెదిలాడు. ఎలాగైనా రమణయ్యను కలుసుకోవాలని శోభబంగాళానుంచి నేరుగా రమణయ్యఇంటికి వెళ్లాడు. రమణయ్య అప్పుడే వచ్చి, విశ్రాంతి తీసుకుంటున్నాడు. రాజారావును చూసి లేచివచ్చి, గుండెలకు హత్తుకున్నాడు. రాజారావు హృదయంగమమైన భావనలు పొందాడు. ఏమిటో ఆ మనసులకలయిక!

రమణయ్య అంతా విని, తృప్తితీర నవ్వుకుని, "అనుకోని అనేకవిజయాలు పొందుతున్నావు. కాని ఎప్పుడో చేయవలసిన ఆ ఒక్కపనీ యిప్పటికీ చేయలేకపోయావేం బాబూ?" అన్నాడు.

రమణయ్య ఏ విషయము తేలికగా మాట్లాడడు. అతని ప్రతిమాటలో భావగర్భితంగా, యదార్థత ప్రతిధ్వనిస్తుంది. రాజారావు ఆలోచలోపడి

"అదేమిటి బాబాయ్" అన్నాడు.

చిరునవ్వుతోనే రమణయ్య బదులు చెప్పాడు, "రమణ పద్మలకు నిన్నుకలుసుకునే అదృష్టం యింకా రాలేదా?"

రాజారావు నిర్విణ్ణుడయాడు. రమణ, పద్మలవిషయం రాగానే గాఢసుషుప్తిలో మునిగిపోయాడు. ఔను! రమణ, పద్మల గతేమిటి? వాళ్ళపురోభివృద్ధికోసం; పోషణకోసం తను జీవనోపాధి వెతుక్కుంటూ, మద్రాసు వచ్చాడు. కాని రెండుసంవత్సరాలు జరిగిపోయినా, తీరా జరిగిందేమిటి! తను

వాళ్ళ కోసం ఉత్తరంముక్క కూడా వ్రాయలేకపోయాడు. ఉత్తరం వ్రాయాలనుకున్నప్పుడల్లా ఆర్థికసహాయం చేయకుండా జాబులువ్రాసి ప్రయోజన మేమిటనిపించేది. తీరా డబ్బుపంపాలనుకున్నప్పుడు పట్టుమని తనదగ్గర పదిరూపాయలు వుండేవే కాదు. ఈ సందిగ్ధంలో, నిస్సహాయతలో, తాత్కాలిక జీవనోపాధిమార్గంలో సంవత్సరాలే గడిచిపోయాయి. కాని యిప్పుడు రమణను, పద్మను కలుసుకోడానికి ఎందుకు ఆలస్యం జరగాలి?

రాజారావు ఆలోచననుంచి తెప్పరిల్లి, రమణయ్యను పూజించి తన అనాలోచితమైన ఆలస్యానికి పశ్చాత్తాపం పొందాడు. శోభ పేర ఒక చీటీవ్రాసి రమణయ్యకు అందించి, రమణయ్యప్రోద్బలంతో ఆ రాత్రికే గుంటూరు ప్రయాణం కట్టాడు.

రాజారావు తలవనితలంపుగా గుంటూరులో ప్రత్యక్షంకావడం కామేశ్వరి, పద్మ, రమణల అపరిమిత ఆశ్చర్యానికి కారణమైంది. అతనిని చూసిన తొలిక్షణంలో అందరూ స్తబ్ధులై తెప్పరిల్లుకున్నారు. రమణ అన్నను గాఢాలింగనంచేసుకొని ఆనందాబ్ధిలో మునిగిపోయాడు. పద్మ అన్నను చూసుకొని ఆవేశంతో ఆనందబాష్పాలు రాల్చింది. హృదయంగమమైన యీ సంఘటనకు జగన్నాథం పరలోకయాత్ర చేసినతర్వాత తొలిసారిగా కామేశ్వరి హృదయసంద్రంలో సంతోషతరంగాలు వుప్పొంగి పరుగులుతీశాయి.

కాని, రాజారావుకు యీ అనుభవం, ఆనందం క్షణభంగురమైంది. క్షయవ్యాధితో జగన్నాథం తనువుచాలిం

చిన విషాదసంఘటన, ప్రమాదవశాత్తు పూరిపాకలకు నిప్పంటుకుని రమణ నిర్మించుకున్న 'పద్మాయిండస్ట్రీ' అగ్నికి ఆహుతైన దుర్ఘటన అతనిసంతోషానికి సంకెళ్ళువేశాయి.

కలవనితలంపుగా ఎదురైన యీ బాధ్యతానిర్వహణకు పరిస్థితులను నిశితంగా, అప్రమత్తతతో రాజారావు పరిశీలించాడు.

మానవునిప్రజ్ఞ అతీతమైనది. విజ్ఞానశాస్త్రఫలితాలు పరలోకాలకు చేరవకలిగించినా ఫలితాలను ఎప్పుడూ భగవంతుడే శాసిస్తాడు. కనుకనే సజీవునిలో ప్రాణం ఏమిటో, నిర్జీవునిలో లేనిదేమిటో తెలుసుకోలేక శాస్త్రజ్ఞుడు తెల్లముఖం వేశాడు. వ్యక్తిగతంగా మనకున్న బాధ్యతకన్నా, భగవంతునికి అత్యధికమైన బాధ్యతలు వున్నాయి. మానవజీవితంలో ఎవరిశక్తికీ లొంగని మోసపల్లాలను భగవంతుడు సరిదిద్ది సమన్వయపరచగలడు.

అలాగే జగన్నాథాన్ని తీసుకవెళ్ళడంతో సర్వాంతర్యామి కామేశ్వరికి పెరిగి పెద్దదవుతున్న హిందీవిద్యాలయాన్ని, హిందీభాషలో ఆరితేరి చేతికక్కరకొచ్చిన పద్మను అందచేశాడు.

రాజారావు పద్మవిషయం కామేశ్వరికి వదలి, రమణ విషయంలో తీవ్రంగా యోచించాడు. పెంచి పెద్దదిచేసిన యిండస్ట్రీ నేలమట్టమైపోయింది. పునాదివేసి, గోడలునిర్మించి, శ్రమించి కట్టుకున్న భవనం నేలపాలైంది. మొదలుపెట్టి, పునాదులుతీయడమా, మరొకభవనంలో తలదాచుకోవడమా ?

రాజారావు రమణను పిలిచి చెప్పాడు. "సంవత్సరాలుగా శ్రమించినకష్టం బుగ్గిపాలైంది. నాతో మద్రాసు రాతున్నావా, కొంతకాలం చదువుకుందువుగాని."

రమణ మారిపోయాడు. అతనిలో ఆశాభావం. పట్టుదల పురకలువేస్తూవున్నాయి. చిరునవ్వు నవ్వి,

"చదివేవయస్సు పోయిందన్నయ్యా. జగన్నాథం గారి దయతో యింట్లో చదివే మెట్రిక్ ప్యాసయ్యాను. తల తాకట్టుపెట్టిఅయినా, నా యిండస్ట్రీకి ప్రాణంపోసుకుంటాను" అన్నాడు.

రమణవాదానికి రాజారావు విస్తుపోయి, మరేమీ మాట్లాడలేక తనలోతాను నవ్వుకుని వూరుకున్నాడు.

తనదగ్గర మద్రాసునుంచి తెచ్చిన వెయ్యిరూపాయలు వున్నది. మరునాడే ప్రారంభించి కొత్త పూరిపాకలువేయించి వారంరోజులకల్లా "పద్మాయిండస్ట్రీ" కి పునర్జీవంపోసి రమణకు వప్పచెప్పాడు. అన్న చేసిన సహాయానికి రమణ పరవశుడయిపోయాడు. నూతనోత్సాహంతో మరొకసారి వ్యాపార రంగంలో పరుగులుతీయడానికి నడుంకట్టాడు.

రాజారావు మద్రాసుచేరి సెంట్రల్ యిండస్ట్రీలో సేల్సుమేనేజరుగా ఛార్జితీసుకున్నాడు. శోభామందిర్ లో మకాం ఏర్పరచుకున్నాడు. అతని దినచర్యలో యిప్పుడు రెండేరెండు ప్రధానఘట్టాలు. ఆఫీసు - శోభ. ఆఫీసుకు వెళ్ళేంతవరకు తిరిగి వచ్చినతర్వాత అతని తీరికకాలమంతా శోభ ఆక్రమించుకునేది. శోభసమక్షంలో రాజారావుకు కాలం శరవేగంతో పరుగులుతీస్తున్నట్లు తోచింది.

నెలనెలా వచ్చే జీతం ఖర్చుపెట్టే అవసరంకాని, అవకాశంకాని రాజారావుకు ఎప్పుడూ కలగలేదు. తన ఆహార విహారాదులకు శోభామందిర్‌లోనే ఏర్పాటుజరిగింది. శోభ మార్కెటింగ్‌కు వెళ్ళినప్పుడల్లా తనకూ, రాజారావుకూ, నందకిశోర్‌కు విలువైనదుస్తులు కుప్పతిప్పలుగా తెచ్చిపడేసేది. మంచి సినిమాకాని, ప్రదర్శనంకాని వుంటే శోభ ముందుగా టిక్కెట్లు రిజర్వుచేసి రాజారావు చెవులోవూదేది. నందకిశోర్ గారికి వున్న రెండు ప్లిమత్ కార్లలో ఒకటి తన స్వంతపనులకు వుంచుకొని, రెండవది శోభ, రాజారావులకు ప్రత్యేకించారు.

ఆరు నెలలు గడిచేప్పటికి, రాజారావు, శోభల స్నేహం ప్రేమగా రూపొందింది. ఆ ప్రేమ వికసించి, వివాహపుష్పంగా విప్పారడానికి తహతహలాడుతున్నది.

నందకిశోర్ ఎలానో పసికట్టారు. ఒకరోజుఉదయంటీ సమయంలో రాజారావుతో కాలక్షేపంచేస్తూ,

" ప్రేమపుష్పం వికసించి ఫలాలనివ్వాలి. మీ అన్యోన్యత నన్ను ఆకర్షించింది. నా భార్య కడసారికోరికను తీర్చడానికి ఆసరాయిచ్చింది. మీ అభ్యంతరం లేకపోతే యీ వారంలోనే శోభతో మీ వివాహానికి ఏర్పాటుచేయాలనుకున్నాను. " అన్నాడు.

రాజారావు ఆశ్చర్యపడలేదు. శోభ అభిప్రాయం తెలుసుకొని, ఒకరోజు నందకిశోర్ యిలా అడుగుతారని అనుకుంటూనేఉన్నాడు. మనసులొకటైనతర్వాత వివాహానికి మరికొంతకాలం వాయిదా వేయవలసినఅవసరం రాజారావుకూ

కనుపించలేదు. రాజారావు తన అంగీకారాన్ని చిరునవ్వు తోనే సూచించాడు. నందకిశోర్ కవితాహృదయాన్ని అర్థం చేసుకొని, దట్టమైన మీసాలసందులోంచి నవ్వుతూ శెభాష్ అన్నారు లేచి ఆఫీసుకు వెడుతూ.

క్లుప్తంగా, క్లీవిగా, అందంగా జరిగింది రాజారావు శోభలవివాహం. శాంతి చూసుకొని రమణ, పద్మ, కామే శ్వరి వచ్చి పెండ్లిమూడురోజులూ ఉండిపోయారు, హిందీ విద్యాలయకార్యక్రమానికి ఆటంకంలేకుండా. రమణయ్యతనకు సీడలోనీడై నెలరోజులు వుండి వెళ్ళాడు. పోస్టుజవాను తెచ్చే ఉత్తరాలవలె, నిలువక పరుగెత్తేకాలం తనతో మంచినీ, చెడునూ తెచ్చి, వదలి వెడుతూనేఉంటుంది. మంచి చెడు కోసమో, చెడు మంచికోసమో మానవుడు నిర్ణయించలేడు. కాలానికి సానుభూతిలేదు; ఆగకుండా, వెనుతిరిగి చూడకుండా పరుగెడుతూ నేవుంటుంది. సంతోషంలో వేగంగా, విచా రంలో భారంగా కాలంగడచినట్లు కనుపించవచ్చు; కాని కాలంవేగం ఎలా మారుతుంది?

నందకిశోర్ వున్నట్లుండి ఒకనాడు గుండె నొప్పితో యింటికి వచ్చాడు. ఇద్దరు ప్రముఖడాక్టర్లు వచ్చి, పరీక్షించి యింజక్షనులుయిచ్చారు. రాజారావు, శోభ కళ్ళలో వత్తులు వేసుకొని సేవచేస్తూ కాచుకుని కూచున్నారు. నందకిశోర్ నోట మాట పెగల్లేదు. అర్ధరాత్రికి ఒళ్ళు చల్లబడింది. డాక్టర్లు వచ్చి చూసి పెదవి విరిచారు. నందకిశోర్ తెల్లవారుతుండగా పరలోకయాత్రాగతులయ్యారు.

వలవలా విలపించిన శోభ, ప్రియబాంధవుడిని కోల్పోయి, విషాదవదనుడైన రాజారావు సముద్రప్రయాణంలో పెను తుఫాను నెదుర్కొన్నారు.

నందకిశోర్ కన్నుమూశాక, శోభకోరిక మన్నించి 'సెంట్రల్ యిండస్ట్రీ' మేనేజిమెంటుఅంతా రాజారావే చూడవలసివచ్చింది. కాగా కిశోర్ మరణంవల్ల రాజారావుకు బాధ్యతలు, శోభకు హక్కులు పెరిగాయి.

ఆస్తికంతా హక్కువచ్చి, సర్వాధికారిణి కావడంతో ఆమెలో కొత్తఆశలు చిగురించి, సరికొత్త అనుభవాలుపొందే అవకాశం కలిగింది. మూలుగుతూన్న ధనరాసులు తనవశమై శోభ పరవశమైపోయింది.

విరామకాలాన్ని గడపటానికి ఆమె ఎక్కువకాలం 'లేడీస్ క్లబ్బులో', స్నేహితులయిండ్లలో గడపటం ప్రారంభించింది. స్నేహితురాండ్ర ప్రోద్బలంతో పోటీకి నిలచి క్లబ్బుకార్యదర్శినిగా ఎన్నికయింది.

స్నేహితులసంఖ్యతో బాటు, ఆమె దుశ్శాఖ్యాలు(?), హోదా పెరిగాయి. అలాగే క్లబ్బుబాధ్యతలు, బైటచేయవలసినపనులు పెరిగాయి. క్లబ్బుపనుల్లో తిరగటంప్రారంభించాక ఒకరిద్దరు పాత మగస్నేహితులుకూడా యిప్పుడామె జీవిత రంగంలో ప్రవేశించారు.

రాజారావుకు యిప్పుడు ఆర్థికలోపంలేదు. ఇంట్లో నోట్లకట్టలు మూలుగుతున్న క్యాషుబీరువా బీగాల్లో ఒక బీగం శోభే తనకుయిచ్చి కావలసినడబ్బు వాడుకోమన్నది. ఆఫీసులో తనకు కావలసినప్పుడు ఎంతడబ్బయినా తీసుకో

వచ్చు. తన కోక శ్రీమత్ కారు ప్రత్యేకంగా శోభే ఏర్పాటు చేసింది.

కాని, రాజారావుకు భౌతికవిజయాలు చేకూరినా, మానసిక అపజయాలుతప్పలేదు. ఇప్పుడు తనకు శోభను కలుసుకోవడానికిగాని, ఆమెతో పదినిముషాలు కాలక్షేపంచేయడానికిగాని అవకాశం దొరకడంలేదు. ఒకరు లేనప్పుడు మరొకరు యింటికివచ్చి వెళ్ళడం జరుగుతున్నది. లేదా ఒకరు యింటినుంచి వెడుతున్నప్పుడు మరొకరు యింటికిరావడం జరుగుతున్నది. ఇంట్లో శోభ రాజారావును కలుసుకున్నప్పుడు ముభావంగా తుంచినట్లు మాట్లాడేది.

క్లబ్బు సభలు, నాటకాలు నిర్వహించవలసివచ్చినప్పుడు ఒకటి, రెండురోజులు శోభ యింటికే వచ్చేదికాదు. ఒకరోజు శోభ స్నేహితుడికారులో రాత్రిపదకొండుగంటలకు యింటికి వచ్చింది. మరొకనాడు రాజారావు యింటికివస్తుండగా ఆమె స్నేహితునితోకలిసి విందుకు వెడుతున్నది.

రాజారావు సహనంతో బాధను భరించాడు. కాని ఆమెలో మార్దవం, ఆత్మీయత ప్రేమాభిమానాలు కొరవడిపోతున్నాయని తెలుసుకొని, భరించలేక ఒకనాడు ఆమెలో వచ్చినమార్పు స్పష్టపరిచాడు. సరిదిద్దుకోవడం అన్యోన్యతకు అవసరమని నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు. ఆమె విన్నది; విననట్లు ప్రవర్తించింది. చాలా స్వల్పవిషయంలో రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది.

రాజారావుకు ఓర్పు వున్నది. దూరాలోచనావున్నది. కాని, గుండెలమీద కుంపటివంటి శోభ నిర్ల

త్యాగతను ఎంతకాలం భరించడం? తనబాధ మరొకసారైనా
శోభకు స్పష్టపరచాలని రాజారావు ప్రయత్నించాడు. ఆమె
తీరికగా చిక్కనేలేదు. క్షణంలోవచ్చేది; క్షణంలోవెళ్ళేది.

ఒకరోజు రాజారావుకు జ్వరంవచ్చింది. సాయంత్రా
నికి తీవ్రరూపందాల్చింది. ఫామిలీడాక్టరు వచ్చి, యింజక్షను
యిచ్చివెళ్ళాడు. శోభ రాత్రి ఎనిమిదిగంటలకు వచ్చింది.
విషయం విని రాజారావుగదిలో కొచ్చి, ప్రయాణసన్నాహ
ములోనే, రాజారావువంక తిరిగి, "అయ్యో! జ్వరమా, ఇప్పు
డెలావున్నది?" అని అడిగింది. రాజారావుకు చాలా నీరసం
గావున్నది. ఐనా అతని పాలిపోయిన పెదిమలమీద చిరు
నవ్వు వెలిసింది. అభిమానాన్ని చంపుకొని, శోభను కూచో
మని సౌంజ్ఞచేస్తూ, నీరసించిన కంఠంతో " ఈ ఒక్కపూట
నాదగ్గరే వుండు శోభా " అని అర్థించాడు. శోభ కూచో
లేదు. చేతిగడియారంవంక చూసుకుంది. " నారీ- క్లబ్బు
వార్షికోత్సవాలు. ప్రతిక్షణం అమూల్యం. జాగ్రత్తగాచూడ
మని బాయ్‌కి చెప్పి వెడతాన్లే " అంటూనే ముందుకు అడు
గులువేసింది.

రాజారావుమనస్సు చివుక్కుమన్నది. ఒంట్లోవేడి
కన్నా, మనసులో వేడి హెచ్చిపోయింది. ఆలోచనాతరం
గాలు మెదడులో రైళ్ళలా పరుగెత్తాయి. తనెవరు ? తన
స్థానం ఏమిటి ? ఇప్పుడు శోభకూ, తనకూ వున్న సంబంధం
ఎటువంటిది ?... ఏమిటీ దుర్భరజీవితం ?

అతనికి కళ్ళు మూతలుపడలేదు. తీవ్రమైన, తీక్షణమైన యోచనలు, బాధ మెదడును చిందరవందరచేశాయి. రాజారావు ఆలోచిస్తూనే పడుకున్నాడు.

మానవుడికి జీవితంలో పరిపూర్ణసంతోషాన్ని ఇవ్వగలిగేది ఏమిటి? డబ్బా? — తనకు అందుబాట్లో కావలసినంత వుంది. దాంతో తను ఏమైనా కొనగలడు. దేనినైనా వశపరుచుకొనగలడు. కాని, తనకు కావలసిన శోభహృదయాన్ని వశంలోపెట్టుకోలేకపోయాడు.

హృదయంయిచ్చినవ్యక్తి మంచిసంపద నందుకోవడం అదృష్టమే; ఆనందదాయకమే. కాని హృదయంలేనిధనరాసు లెందుకు? వ్యక్తిత్వం కోల్పోయి, భావదాస్యంచేస్తూ మనసులేని అర్ధాంగితో ధనరాసుల్లో పొర్లుతున్నా మనశ్శాంతిలేకుండా మానవుడు ఎంతకాలం మనగలడు?

ఆర్థికబలం లేకపోయినా సహృదయత, ప్రేమ, అభిమానం వున్నచోట మనశ్శాంతి లభిస్తుంది. సంతోష జీవితానికి మానవునకు కావలసింది మణులు, మాణిక్యాలు కాదు. మనశ్శాంతి. డబ్బును పోగొట్టుకొని మనశ్శాంతిని పొందటమా, డబ్బునుపట్టుకుని వ్రేలాడుతూ, మేధస్సుకు సంకెళ్ళను, భీకరమైన మానసికతుఫానును భరించడమా?

రాజారావుకు భీకరమైన యీ పరిస్థితిలో తెల్లవారుఝామున కునుకుపట్టి తెల్లవారకముందే మెలుకువవచ్చింది. జ్వరంతగ్గి వళ్ళుచల్లబడినా నీరసం తగ్గలేదు. రాజారావు శోభామందిర్ తోటలోకి వచ్చి కూర్చుని, కొంతకాలం గడిపాడు, వుదయం ఎనిమిదిగంటలైనా శోభ యింటికి తిరిగి

రాలేదు. శోభవిషయం గుర్తుకురాగానే విద్యుత్ ప్రవాహం తాకి శరీరం గగుర్పాటుపొందినట్లు అతను ఫీలయ్యాడు. క్షణములో బంగాళాలోకివచ్చి చొక్కా వేసుకొని, వీధిలోకివచ్చి బస్సుఎక్కి సెంట్రల్ స్టేషను చేరాడు. రాజారావు యిలా బయలుదేరడం ఎక్కడికీ ప్రయాణమై కాదు. బరువైన ఆలోచనలనుంచి తప్పుకోడానికిమాత్రమే.

సెంట్రల్ స్టేషన్‌లోని హిగిన్ బాతమ్స్‌లో రాజారావు పత్రికలు తిరగేస్తుండగా, అతనిభుజంమీద ఎవరో చెయ్యి వేశారు. రాజారావు వెనుతిరిగి చూడకముందే ఆ స్పర్శ అతని హృదయాంతరాళాని కేదో మధురసందేశాన్ని, గత స్మృతిని, పంపింది. ఆ స్పర్శలో రాజారావు పరిచితిని, ప్రశాంతతను అనుభవించాడు. మృదువుగా వెనుతిరిగి చూశాడు; మనిషినిచూసి పోల్చుకోడానికి ప్రయత్నిస్తుండగానే, ఆ వ్యక్తి అందుకని అన్నాడు.

"గుర్తుపట్టలేదా. నా పేరు కరుణాకుమార్. లోగడ రైలుప్రయాణంలో జారిపోయిన నా మనిపర్సును మీనుంచి అందుకున్న కరుణాకుమార్‌ని" త్రుటిలో పాతసంఘటన రాజారావుకళ్ళముందు చలనచిత్రంలా మెరిసింది. ఉద్వేగంతో కరుణకుమార్‌ను ఆలింగనంచేసుకుని, ప్రత్యభివాదంచేశాడు.

కరుణకుమార్ రాజారావును వెయిటింగ్ రూమ్‌కు తీసుకువెళ్ళాడు. అల్పాహారానికి ద్రాక్షరసానికి కబురుపెట్టి, రాజారావుమీద ప్రశ్నలవర్షం కురిపించాడు — ఎక్కడ వున్నారు, ఏంచేస్తున్నారు; ఎక్కడికి వెళ్ళబోతున్నారు? అని,

రాజారావు వుదాసీనతతో జవాబుచెప్పాడు, "విషాద భరితమైన నా జీవితవివరాలు యిప్పుడు మీముందుంచడం భావ్యంకాదు. చెప్పండి, మీరు ఎప్పుడు ఆంధ్రదేశనుంచి వెళ్ళి, బొంబాయిలో స్థిరపడ్డారు?"

కరుణాకుమార్ మందహాసంచేశాడు.

"పదిసంవత్సరాల క్రితం నేను బొంబాయి వెళ్ళి, అక్కడ స్థిరపడినతర్వాత నా పరిశ్రమ స్థాపించాను."

"చాలా సంవత్సరాలకుముందే మీరు ఆంధ్రదేశానికి దూరమయ్యారన్నమాట."

కరుణకుమార్ యీ ప్రశ్నకు తనలోతాను నవ్వుకుని అన్నాడు, "నేను దూరంకాలేదు. పరిస్థితులు దూరం చేశాయి. కాని, ఆంధ్రదేశంమీద నాకున్న మమకారం ప్రేమరూపంపొందే అవకాశంకలిగింది."

రాజారావుకు యీ జవాబు బోధపడలేదు. ప్రశ్నార్థకంగా చూశాడు.

కరుణకుమార్ చెప్పుకుపోయాడు.

"మా కంపెనీలో తయారయ్యేవస్తువులకు సోల్ఏజన్సీ కావాలని ఆంధ్రనుంచి చాలా దరఖాస్తులు వచ్చాయి. ఆపని మీదే నెలరోజులు పర్యటించి, గుంటూరులో వుత్సాహవంతుడైన ఒకయువకునికి మా సోల్ఏజన్సీ ఏర్పాటుచేశాను. ఆ యువకునిపరిచయంలో నాకు మరొక వుదాత్తమైన జీవిత ప్రయోజనం చేకూరింది." రాజారావు శ్రద్ధాసక్తులతో కరుణకుమార్ చెప్పేది వింటూ, "ఆ తర్వాత?" అనిఅడిగాడు.

గుంటూరులో వున్న వారంరోజుల్లో ఆ యువకునిసహో దరితో పరిచయమైంది. ఆమె మరొక ప్రధానఅధ్యాపకురాలితో కలిసి 'హిందీవిద్యాలయం' నిర్వహిస్తున్నది. నాకూ హిందీ వచ్చును. నాఆసక్తికి వారిద్దరూ హర్షించారు. విద్యాలయకార్యాలయాలు శ్రద్ధగా పరిశీలించాను. విద్యాలయ నిర్వహణలో ఆ యువతి కార్యదీక్ష, సహనశక్తి నన్నెంతో ఆకర్షించాయి. ఆ కొద్దిరోజుల పరిచయంలో ఆమె మనో వికాసం, సంస్కారం, శాంతిప్రియత్వం నన్ను ముగ్ధుణ్ని చేశాయి. ఆ యువతి అంగీకరిస్తే వివాహంచేసుకొని, గృహస్థుణ్ని కావాలన్నకోరిక కలిగింది. ఆ యువకుడితో చర్చించాను. తాను సంతోషంతో చెల్లెలును సంప్రదించి, ఆమె అంగీకారాన్ని పొందాడు. ఆ పిల్లలఅన్నగారు మద్రాసులో వున్నాడు. వారి అంగీకారాన్నికూడా పొందడానికి..."

కరుణకుమార్ చెబుతూనేవున్నాడు. రాజారావుకు ఆయువతి తనచెల్లెలు పద్మేనన్న దృఢవిశ్వాసం కలిగి పులకిత హృదయుడై సంతోషభారంతో, "కరుణకుమార్! క్షమించండి; ఆ యువతిపేరు పద్మకదూ?" అన్నాడు.

కరుణకుమార్ చకితుడయ్యాడు. ఆశ్చర్యంతో అడిగాడు. "అవును. ఆమె మీకు తెలుసా?"

రాజారావు సమాధానంచెప్పలేదు. తన సోదరి అదృష్టానికి వుప్పొంగే సంతోషతరంగాలతో కరుణకుమార్‌ను గాఢాలింగనం చేసుకొని అన్నాడు, "ఆ పిల్లల అన్నకూడా సువిశాలమైన మీ హృదయం కోరిన యీ కోరికను అంగీకరించి ఆశీర్వదిస్తున్నాడు. పద్మ నా చెల్లెలే కుమార్!"

కరుణకుమార్ కళ్లు ఆనందతో మెరిశాయి. మానసికోల్లాసం వుప్పొంగి, రాజారావును కృతజ్ఞతతో మరొకసారి గాఢాలింగనం చేసుకున్నాడు.

కరుణకుమార్ తనప్రశ్నను రాజారావుకు మరొకమారు గుర్తుచేశాడు.

"ఇక చెప్పండి. ఇప్పుడు మిమ్మల్నిగురించి చెప్పవలసిన మర్యాద మీకు, తెలుసుకోవలసిన బాధ్యత నాకు వున్నది."

రాజారావు చిరునవ్వునవ్వి అన్నాడు, "గుంటూరులోనే మీకు నావివరాలు తెలిసివుంటాయి. ఇంతవరకు మద్రాసులోవున్నా, యివ్వాళతో ఆ ఋణం తీరిపోయింది. ఇప్పుడు శాంతిని వెతుక్కుంటూ వెళుతున్నాను. ఇందుకు వెళుతున్నదే తెలుసుగాని, ఎక్కడికి వెళ్ళనున్నది తెలియదు"

కరుణకుమార్ కళ్ళు చెమర్చాయి. రాజారావు ఏదో క్లిష్టపరిస్థితిలో ఉన్నాడు. పూర్తివివరాలు తెలియకపోయినా, తను రాజారావుయొక్క మానసికకల్లోలాన్ని, బాధయొక్క తీవ్రతను తెలుసుకోగలిగాడు. రాజారావుకళ్ళలోకి చూస్తూ భుజంతట్టి అన్నాడు.

" ఎందుకు వెళుతున్నదీ నీవే నిర్ణయించుకున్నావు. ఎక్కడకు వెళ్ళవలసింది నేను నిర్ణయిస్తాను. నాతో బొంబాయికి రా రాజారావ్. నీవు వెతుకుతున్న ఆ ' శాంతి ' ని యివ్వడానికి ప్రయత్నిస్తాను. "

రాజారావుకు నోరు పెగల్లేదు. మౌనంగా నవ్వి, కృతజ్ఞతతో చూచాడు. కరుణకుమార్ సర్వెంటును పంపాడు-

బొంబాయికి రెండు మొదటితరగతి టిక్కెట్లు బుక్ చేయమని.

కరుణకుమార్ పదహారణాల ఆంధ్రుడే. గోదావరి జిల్లానుంచి వెళ్ళి, బొంబాయిలో ఒక ప్రముఖ పారిశ్రామిక సంస్థలో ఆరితేరి, యిప్పుడు స్వంతంగా పరిశ్రమను నిర్వహిస్తున్నాడు. మనిషి చాలాచురుకైనవాడు; మాటకారి. ఎంతటివాడితోనైనా క్షణంలో స్నేహితంచేసుకోగల నేర్పుకలవాడు. మనసిచ్చిమాట్లాడి, మనసులోని బాధకు మార్గాంతరం చూపగలడు.

బొంబాయి రైలు ప్రయాణంలో కరుణకుమార్ రాజారావుకు చాలా సన్నిహితంగా వచ్చాడు. అంతరంగిక విషయాలతో ప్రారంభమైన సంభాషణ ఆత్మీయతను పెంచింది. చిందరవందరైన రాజారావుమనసుకు కరుణకుమార్ ఆత్మీయత ఆసరాయిచ్చింది. కోల్పోయిన దేనికోసమో చీకట్లో తారట్లాడుతున్న తనకు వెలుగుచూపింది,

బొంబాయి చేరాక ప్రేమప్రపూరితమైన కరుణకుమార్ ఆదరణలో రాజారావుకు శాంతిలభించింది. రమణకు రమణయ్యకు వుత్తరాలు వ్రాశాడు.

రాజారావుఏర్పాటుప్రకారం రమణ, పద్మ, కామేశ్వరి బొంబాయి చేరుకున్నారు. కరుణకుమార్ పద్మల వివాహం నిరాడంబరంగా జరిగింది. ఆనందంగా, అందంగా పద్మవివాహం జరిగినందుకు కామేశ్వరిహృదయంలో వెన్నెలలు వెలిశాయి. కామేశ్వరి, రమణ పద్మను వదలి వెళ్ళలేక వెళ్ళలేక బరువుగా, బాధగా గుంటూరు ప్రయాణంకట్టారు.

ఎప్పుడోఒకప్పుడు శోభ తనమనస్సులో మెదిలినా,

మరచిపోవడానికి రాజారావు సాధనచేస్తుండగా, రమణయ్య ఉత్తరం వ్రాశాడు మూడుమూడుముక్కల్లో.

" ప్రియబాబూ,

పద్మపెళ్ళికి ఆహ్వానం అందింది. అనారోగ్యం నా ప్రయాణానికి అడ్డుపడింది.

సెంట్రల్ యిండస్ట్రీ మేనేజరు వ్యాపారాన్ని అప్పులపాలుచేసి శోభ ఆస్తినంతా హరించివేశాడు. శోభ చాలా దైన్యస్థితిలో వుంది. నాకోసమైనా ఒకమారు మద్రాసువస్తే కృతజ్ఞుణ్ణి.

నీ రమణయ్య "

ఉత్తరంచదివి, రాజారావు చలించలేదు. తనుహించిన విషయం యింత త్వరితంగా కార్యరూపంపొందినందుకు చకితుడయ్యాడు. కాని ఏ కోశాన మద్రాసువెళ్ళడానికి మనస్కరించలేదు. మరుక్షణంలో శోభవిషయం మరచిపోవడమే తన ధ్యేయంగాపెట్టుకున్నాడు.

బొంబాయిచేరిన రెండుసంవత్సరాలకాలంలో రాజారావులో చాలా మార్పువచ్చింది. తనకుతాను చొరవచేసుకొని కరుణకుమార్ పరిశ్రమాభివృద్ధికి పథకాలువేసి అమలుపరచడానికి రాజారావు కరుణకుమార్‌కు కుడిభుజంగా నిలచి పనిచేస్తున్నాడు. అతని నిశితదృష్టికి, కార్యదక్షతకు కరుణకుమార్ చాలా సంతసించాడు.

రాజారావు అప్రమత్తతతో బాధ్యతలు నిర్వహిస్తూ లభించిన ప్రతిక్షణం తీరికను కరుణకుమార్‌సమక్షంలోనో ఉత్తమసాహిత్యపఠనంలోనో గడపటం అలవరచుకున్నాడు. పద్మప్రోత్సాహంతో, సహాయంతో హిందీభాషాజ్ఞానం

కూడ సంపాదించుకున్నాడు. ఈ నూతన అనుభవాలలో పొందిన అనుభూతులు రాజారావు హృదయఫలకంమీద స్థిరమైన రూపకల్పన పొందాయి.

రాజారావుమనసులో రేగిన తుఫానుకు బొంబాయి జీవితంలో జవాబువచ్చింది. మంచీ-చెడూ; సుఖం-దుఃఖం ప్రకృతిసహజమైన కలయికలు. వాటిని విడదీయటానికి ప్రయత్నించడంకన్నా, మరింత దగ్గరకు తీసుకువచ్చి సమన్వయ పరిచేసాధనలో శాంతివున్నది; వెలుగుచూపే ప్రయత్నం లోనే చీకటిని పారద్రోలాలి. చీకటిని ఎదుర్కొనకుండా వెలుగునుపొందాలనుకోవడం కేవలం వెర్రితనం.

ఒకనాటిఉదయం రాజారావు పరమహంసజీవితం చదువుతూ కూర్చున్నాడు. గ్రంథంలోని ఒక సంఘటన చదువుతూండగా ఛట్టున శోభ గుర్తువచ్చింది. మళ్ళీ క్షణికమైన జుగుప్స కళ్ళుమూసుకొని ఆ ఆలోచననుంచి తప్పుకోడాన్ని ప్రయత్నించాడు. తృటిలో తనపాదాలమీద ఎవరో శిరసుకి వుంచిన అనుభవంపొందినట్లు, వెక్కి-వెక్కి ఏడుస్తున్నస్వరం వినిపించినట్లనిపించింది. కల కాదుగదా! అని కళ్లుతెరిచి చూచాడు. శోభ తనపాదాలవద్ద కుప్పలాకూలి వెక్కి-వెక్కి ఏడుస్తున్నది.

రాజారావు పలకలేదు; ఉలకలేదు. అక్కడినుంచి తప్పుకొని దూరంగావెళ్ళి ఆకాశంలోకి చూస్తూ నిలుచున్నాడు.

శోభ జ్యోతుల్లావున్న ఎర్రటికళ్ళను వొత్తుకుంటూ దగ్గరగావచ్చి విలపిస్తూ విన్నవించుకున్నది. "నా పాపం పండి ఫలితాన్ని అనుభవిస్తున్నాను. మనసారా నన్ను

క్షమించండి. నిశ్చింతగా కళ్లుమూసుకుని మరుజన్మలో మీ చరణదాసిగా వుండే అర్హత పొందుతాను."

రాజారావు సుషుప్తిలోనే ఉన్నాడు. శోభవంక తిరిగి గంభీరంగా చూశాడు. ఆమెను తప్పుకొని బయటకు వెళ్ళే ప్రయత్నంలో ముందడుగు వేశాడు.

లోపలనుంచి 'రాజారావ్' అన్న మధురస్వరం వినిపించింది. అమాయకహృదయం ప్రసవించగా, అందాల నవ్వు పుట్టినట్లు, మెరుస్తున్న కళ్ళతో బిగ్గరగా నవ్వుతూ కరుణకుమార్ వచ్చాడు.

దగ్గరగా వచ్చి, దీర్ఘంగా హృద్యమంగా ఒకసారి రాజారావు వంకా, మరొకసారి శోభవంకా చూశాడు. రాజారావు భుజంమీద చేయి వుంచి, శోభకు సమీపంగా తీసుకువచ్చి మరొకచేత్తో ఆమె భుజంస్పృశించి, యిద్దరి కళ్ళలోకి చూస్తూ రాజారావుచేయి శోభ చేతిలోవుంచి అన్నాడు, "శాంతి మనుషులలో లేదు సుమా; మనసులలో ఉన్నది."

రాజారావులో క్షణంలో వుదాత్తమైన అనుభూతి కలిగింది. శోభకళ్ళలోకి హుందాగా చూస్తూ అన్నాడు; "చూడు శోభా,నా గురువుగారి అమరసందేశమే మన కలయికకు కారణమైంది." శోభ కళ్ళవెంట జలజల ఆనంద బాష్పాలు రాలాయి. ప్రమోదంతో కరుణకుమారకు నమస్కరించి, పశ్చాత్తాపభారంతో రాజారావుపాదాలమీద వాలింది. రాజారావు మందహాసంతో ఆమెను లేవదీసి గాఢాలింగనం చేసుకున్నాడు.

మనుషులు కాదు. మనసులు మారాయి.